## సదాశివ సమారంభాం



గురు దక్షిణామూర్తి



గురు వేదవ్యాస మహర్షి



గురు శుక మహర్షి



గురు నారద మహర్షి



గురు వాల్మీకి మహర్షి



గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం



గురు దత్తాత్రేయ



గురు బాబాజీ



గురు గౌతమ బుద్ధ



గురు ఆదిశంకరాచార్య



గురు రామానుజాచార్యులు



గురు జ్ఞానేశ్వర్



గురు రవిదాస్



గురు కబీర్ దాస్



గురు చైతన్య మహా ప్రభువు



గురు నానక్



గురు రాఘవేంద్ర స్వామి



గురు వీరబ్రహ్మేంద్ర స్వామి



యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం



గురు త్రైలింగ స్వామి



గురు లాహిరి మహాశయ





గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి



గురు వివేకానంద



గురు సాయి బాబా



గురు అరబిందో



గురు రమణ మహర్షి



గురు యోగానంద



గురు భక్తివేదాంత ప్రభుపాద



గురు మళయాళస్వామి



గురు విద్యాప్రకాశానందగిరి



గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





# భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

**Digital Library of India**

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!



మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# BHARATA JYOTI

# భారతజ్యోతి

## రెండవ భాగము

గ్రంథకర్త

ఏ. యస్. పంచాపకేశ అయ్యర్, ఎం. ఏ. (ఆక్సన్)

ఐ. సి. యస్., బార్-ఎట్-లా., ఎఫ్., ఆర్. ఎస్. ఎల్.,

అనువాదకులు

పి. గోపాలయ్య, బి. ఏ., బి. ఇడి,

పి. నారాయణయ్య




ది ఓరియంటల్ పబ్లిషింగ్ కంపెనీ, (రిజిష్టర్డు)

మద్రాసు :: తెనాలి :: హైదరాబాద్

 1960 [redacted]

# పీఠిక

శ్రీమాన్ వి. యస్. పి. అయ్యర్‌గారి రచన లతి బాహుళ్యములు. ఆంధ్రులకు వారు సుపరిచితులు. వారి పూర్వ గ్రంథములు కొన్ని యిదివరకే తెనిఁగింపఁబడినవి. వారి గ్రంథములు వివిధ దేశము లందును భారతదేశపు ఔన్నత్యమును జాటుచున్నవి.

ప్రకృతము మేము తెనిఁగించినవి వారి ' పురాతన కథలు '. దీని తర్జుమాహక్కులు మాకుఁ బ్రసాదించినందులకు శ్రీ అయ్యరుగారికి మిక్కలి కృతజ్ఞులము.

అయ్యరుగారు ఆంగ్లభాషాకోవిదులు. వారి కల మెట్లాడిన నట్లాడు నా భాష. అయ్యరుగారి భావములకు విరుద్ధత కలుగకుండ, నాంధ్ర భాషా సంప్రదాయముల నతిక్రమింపకుండ భాషాంతరీకరణము సాగించితిమి. రచన స్వతంత్రముగా, సరళముగా, ధారాళముగా నుండునట్లు ప్రయత్నించితిమి.

ఈ కథావళి యందలి నైతికాధ్యాత్మికశక్తులు కోమల మనస్కులగు బాలికా బాలుర మనస్సుల కుద్దీపన గలిగించి, భావిభారత భాగ్యోదయమున కుపకరించు నని విశ్వసించుచున్నాము.

ఈ యమూల్యగ్రంథము నాంధ్రలోకము సముచితముగ నుపయోగించుకొని సన్మానించుగాత !

ఈ గ్రంథమును స్వల్పకాలములోనే చక్కగ ముద్రింపఁజేసి మమ్ము ప్రోత్సహించిన ప్రకాశకులకు మా కృతజ్ఞతాపూర్వక వందనములు.

—అనువాదకులు

# విషయసూచిక

# భారత జ్యోతి

## 1. సామరస్యము

శ్రీహర్షుఁడు ప్రసిద్ధభారతచక్రవర్తి. ధీరుఁడు. గొప్ప పరిశోధకుఁడు. శైవ, బౌద్ధ, సౌరమతములలో నుత్తమమైనదాని నవలంబింప నాతని ప్రజలు కుతూహలురై యుండిరి. అట్టియెడ నా త్రిమతములందలి సర్వోత్కృష్టసిద్ధాంతముల నాతఁడైక్య పఱచెను. కేవల శివారాధకుఁడవు గమ్మని బాణుఁ డడిగెను. భాస్కరారాధకుఁడవు గమ్మని కుమారపాలుఁడు వేఁడెను. బౌద్ధమతావలంబకుఁడ వగుమని హ్యూయాన్‌త్సాంగ్ ప్రేరేపించెను. అమ్మువ్వురి నిర్బంధములవలనఁ జక్రవర్తికడుఁజీకాకు నొందెను. ఎటులనైన నాయొత్తిడులఁ దప్పించుకొని అందఱి ప్రేమకును బాత్రుఁడగుట కాతఁడు నిశ్చయించుకొనెను.

ఒకనాటి యుదయమున బాణుని రప్పించి తాను బౌద్ధమతము స్వీకరింప నిశ్చయించితినని నుడివెను. అంత బాణుడు "వలదు వలదు. మతమును మార్చుకొనుటకంటె నిప్పటి మతమునే యనుసరింపుడు. అప్పుడప్పుడైన శివునిబూజించుచుండు" డని వేఁడెను. వల్లెయని యాతనిం బంపివేసి కుమారపాలుఁ బిలిపించి తాను బూర్తిగ బౌద్ధమతమునే యనుసరింప సంకల్పించితిననెను. "వలదు వలదు. అంతకంటెను ప్రభువులవారిప్పటి యట్లే యుండి యప్పుడప్పుడాదిత్యభగవాను నారాధింపు"డని కుమారపాలుఁడు ప్రార్థించెను. అట్లే యని యాతనిం బంపివేసి హ్యూయాన్‌త్సాంగ్‌ను బిలిపించి, "నాకులదైవమగు

శివు నిఁక మీఁదఁ బూజింపఁ గుతూహల పడుచున్నా" నని నుడి వెను. అమ్మాటల కాతఁడు "రాజోత్తమా! దానికంటె నిప్పటి తమ చక్కనిపథమే యనుసరణీయము, సర్వోత్తమము. శివసూర్యుల నప్పుడప్పుడారాధించుచుండుడు. కాని హృదయ పద్మమునను, నా స్థానమునను బౌద్ధమతమునకే ప్రాధాన్య మొసగుఁడు" అని వేడెను.

అంత బాణ, కుమార, హ్యూనుల ముప్వుర నొకటిగ జేర్చి యిట్లు నుడివెను: "మీ యందఱి కోర్కెల నంగీకరించితిని. మూడు మతములును మా కభిమతములే. ఎప్పటి యట్లు శివ, రవి, బుద్ధులఁ బూజించుచునే యుండెద. నా తొంటి యుద్దేశ్యముతో మీ మీ యభిప్రాయములెల్ల నేకీభవించుట కడుంగడు ముదావహము. అన్నియు నార్యమతములే. అట్టియెడ వానిలో సంఘర్షణమున కాస్పదమెద్ది? అమ్మ, యమ్మమ్మల పైని ప్రేమ, సతీసుతులపైని ప్రేమ కెట్లంతరాయమగును?"

కొన్ని దినములుఁ గడచెను. భూసారము, ప్రజాసంతృప్తి వీని నభివృద్ధిపఱచు విధానముల నన్వేషించుటకై రాజాస్థానమున గొప్ప చర్చలు జరిగెను. పెక్కు పంచవర్ష ప్రణాళికలు తయారయ్యెను. చెట్లు నాటుటకును, బావులు త్రవ్వుటకును, జెరువులు మరమ్మతు చేయుటకును, అడవులు నరుకుటకును, గృహములు, వసతి గృహములు, దేవాలయములు నిర్మించుటకును, బాటలు వేయుటకును, నొక్కొక్కదానికిఁ బ్రత్యేకముగ నారు ప్రణాళికలు తయారొనర్పఁబడెను. పరమ పవిత్రమైన సప్తసంఖ్య కింకొకటి తక్కువగ నున్నది. కాన

తేఁడే డాన్ని సూచించినఁ బాగుండు నని బాణుఁ డనెను. అంత హర్షుఁడు, "అయిదు వత్సరముల కొకపర్యాయము ధనాగారమునంగల ధనధాన్యములనెల్ల నిర్ధనులకుఁ బంచి పెట్టెద. ధనవంతులనుండి కానుకలఁగొని మఱలఁ గోశాగార మును భర్తీచేసెద" ననియెను. "ఇది యొక నవోద్దేశ" మని బాణుఁ డనుచుండఁగనే, "ఉండనోపు. ఈ నవీన కల్ప నల కెంతమాత్రము నేను చిన్నవోవుటలేదు. నూత్నభావ ములను బిడియముచే బయట బెట్టకుండుట భావ్యముగాదు. వర్షము తటాకముల నింపు పగిది భాగ్యవంతుఁడు బీదల యుదరపోషణ కేల సాయపడరాదు?" అని హర్షసార్వ భౌముఁడు తన తీర్మానమునుఁ బ్రతిపాదించెను. అందఱును హృదయపూర్వకముగ నంగీకరించుటచే నా తీర్మాన మా మోదింపఁబడెను.

పంచవార్షికోత్సవ సమయములలో మూడుమార్లు హర్షుడు తన బొక్కసమును వట్టిదిగఁజేసివైచెను. సామంతులు, ధన వంతులు మున్నగువారొసఁగిన కానుకలచే మఱల దాని నింపగల్గెను. కాని తన పందేరమున నెక్కుడుభాగము బౌద్ధు లకును, బ్రాహ్మణులకును జెందుచుండెను. నిరుపేదల కేలవ మాత్రమో లభించుట గమనించెను. తన పంచవర్ష ప్రణా ళిక పాడయ్యెనని కనుగొని దాని రద్దుపరచి యా ధనమును నూతులు త్రవ్వించుటకై వినియోగింప మొదలుపెట్టెను. వర్షోదకము వారాశిఁజేరుటకంటె బావులు నింపిన నెంతయో ప్రజోపయోగమగు గదా! మఱల నెన్నఁడా ప్రణాళిక ఆతని తలపునకైన రాకుండెను.

## 2. ఉద్బోధ

చైతన్యుఁడు వంగదేశీయుఁడు, సాధువు, వైష్ణవభక్తుఁడు. నిరంతరము భజనలను, సంకీర్తనలను సల్పుచుఁ గాలముఁ గడపుచుండెను. కుల, మత, విచక్షణ యించుకైనను లేక నందఱిని భ్రాతృప్రేమతోఁ జూచుచుండెను. భజనల కాహ్వానించుచుండెను. చైతన్యరహితులను, నాచరణ విహీనులను యుక్తాయుక్త పరిజ్ఞాన శూన్యులను, ఛాందసులను గాంచి యట్టి వారు పండితులైనను జీవచ్ఛవములే యనుచుండెడివాఁడు. 'అగ్రజుని మొదలంత్యజుని వఱకు నందఱికిని శ్రీకృష్ణపరమాత్ముని మహోపదేశమును బోధింపుఁడు' అనునదియే యాతని దివ్యబోధ.

చండాలురును, దామును సమానులే యని నుడువుటచే బ్రాహ్మణులకును, బండితులకునుఁ బట్టరానికోపముఁ గల్గెను. కాని హిందువులలో నధిక సంఖ్యాకు లాతనికి భక్తులైరి. సంకుచిత హృదయులగు తమ సంఖ్య కడు స్వల్పమైనందున స్వాయముగ వారేమియుఁ జేయఁజాలకుండిరి. ఆసాధుమూర్తియొక్క భక్తి సిద్ధాంతములు విజయవంతములు గానిచ్చినచోఁ తమ పేరు ప్రతిష్ఠలకును, గౌరవమర్యాదలకును దప్పక భావికాలమున భంగము వాటిల్లఁగలదని వారు గట్టిగ నమ్ముచుండిరి. ఎటులైన నాతనిఁ బడఁగొట్ట సంకల్పించిరి.

ముస్లిములు, హిందూమతస్థులను, ఈ కుల మాకుల మనుభేదము లేక, బూర్తిగ ద్వేషింతురను విషయ మెఱిఁగియు

మహో(ద్రేకమున సాహసించి వారు తమ ముస్లింపరిపాలకుని సాయ మపేక్షించిరి. శ్రీకృష్ణవిగ్రహము నారాధింపుఁ డని ముస్లిములకుఁ జైతన్యుఁడు ప్రబోధించుచున్నాఁ డనియు, నట్టి దుష్ప్రచారముల నాపుట పరిపాలకులకు విధియనియుఁ బురిఁగొల్పిరి.

ఆ యధికారి యీ చాడీగొట్టు విధముగఁ బ్రోత్సహించుటకుఁ గల కారణము నర్థముఁ జేసికొనెను. ఆ సాధు పుంగవుని భగవద్భక్తినిఁ బవిత్ర చరిత్రముఁ గూర్చి యంతకు పూర్వమే వినియుండెను. తాను ముస్లిమైనందున వారు నుడివిన విషయములనుఁ బరీక్షింపఁ దలఁచెను. భజనలు జరుగరాదని వెంటనే ప్రకటించెను. శాసనము నతిక్రమించిన చైతన్యశిష్యుని భజన పరికరముల నెల్ల ముక్కలు ముక్కలుగ విరుగఁ గొట్టించెను. వెంటనే చైతన్యుఁడు సత్యాగ్రహోద్యమము నారంభింపఁ దీర్మానించెను. మూడు భజన సంఘముల నేర్పాటు జేసెను. వానిలో పెద్ద సంఘమున కాతఁడే నాయకుఁ డాయెను. ప్రభుత్వభవనము చెంత కేగి, భజనసల్ప మొదలిడెను. పాలకుడు చైతన్యుని శాసనోల్లంఘనమునకు దండింపవలసి యుండెను. కాని యీ సాధుమూర్తి పరమ పవిత్ర వర్తనమును, మాహాత్మ్యమును గూర్చి వినియుండి నందున నాతని నేమియు జేయ నొల్లకుండెను. అందుచేఁ దలుపులు, కిటికీలు మూసివైచి యింటియందే కూర్చుండెను.

తలుపు దెరచి నిజమైన ముస్లిమువలె తన్నాదరింపవలసిన దని చైతన్యుఁడు కబురంపెను. అంతియేకాక, "దేవుఁడొకఁడే యనియు, పునర్జన్మముపైని విశ్వాసముఁగలవాఁడెవఁడైనను సరియే గృహద్వారముకడ కరుదెంచినచో నయ్యతిథిని గృహస్థుఁడు తప్పక లోనికిఁ గొనిపోయి సత్కరింపవలయుననియు మహమ్మదు ప్రవక్త బోధించెను గదా! ఆతని యుపదేశము నెట్లుల్లంఘింపఁ గల"వని చైతన్యుఁ డడిగెను. వెంటనే యా యధికారి తలుపులుఁ దెరచి యాతని లోనికాహ్వానించెను. అంత చైతన్యుఁడు "భగవంతునిధ్యానించుట కుపయోగపడుచుండిన నా మిత్రుని పరికరములను, నీ వేల ముక్కలు జేయించితివి ? దుష్ప్రవర్తననుండి ప్రార్థన మెవని నడ్డగింపలేదో వాఁడు నాస్తికత్వము నభివృద్ధిజేయుటయేగాక భగవత్సన్నిధికి దూరుఁడగునని మహమ్మదు నుడువలేదా" అని పాలకుని యడిగెను. "అవును. సంగీతముచే భగవంతుని పూజింపవీలఁగునా?" అనియయ్యధికారి ప్రశ్నించెను. అందులకుఁ చైతన్యుఁడు "భగవంతుని చూచిన వెనుక నీవెట్లారాధింతువో యట్లే యాతని నర్చింపుము. ఏలయన, 'నీ వాతని జూడలేకపోయినను నిన్నాతఁడు చూచుచునే యున్నాఁడు' అని ప్రవక్తవచింపలేదా? నిన్నే ప్రజలు మేళతాళములతోఁ నాహ్వానించుచుండ, నీ వంతమాత్రము దేవుని సత్కరించుట తప్పగునా ?'' యని ప్రశ్నించెను.

అంత నా పరిపాలకుఁడు "మీవారే మీభజనల నిషేధించుమనియు, భజనవస్తువులనుఁ బగులగొట్టుమనియు నన్ను బల

వంతపరచిరి” అనియెను. “ధ్యానము నాశనముఁ జేయుట కితరుల సాయ మపేక్షించువాఁడు మానవుఁడు కాఁడని ప్రవక్త వచించెనుగదా !” యని యా సాధుమూర్తి నుడివెను. “కాని వారు విద్యావంతులే ?” అని పాలకుఁ డనియెను. “దుర్విద్యాపరుఁడు మానవులలో నధమాధముఁడని ప్రవక్త వచియింప లేదా ?” అని చైతన్యు డడిగెను. అంత నా పరిపాలకుఁ డొప్పుకొని, “సోదరా ! నాకంటెను మా మతసిద్ధాంతములను నీవే యెక్కువగ నెఱుఁగుదువే ! నీ యిష్టము వచ్చిన ట్లొనర్పుము. నీ భజనలను, నిత్యసంకీర్తనములను నిర్విఘ్నముగ సాగించుకొనుము” అని మహానందమున నభయ మొసఁగెను.

అప్పటినుండియుఁ జైతన్యుఁడును నా పరిపాలకుఁడును నొకరినొక రన్యోన్యగౌరవభావమునఁ జూచుకొనఁజొచ్చిరి.

## 3. బందిపోటు దొంగలు

కళింగదేశాధీశుఁడగు ప్రతాపరుద్రుఁడు చైతన్యాభిమాని. అతఁ డా మహనీయుని దర్శింపఁ గడుఁ గుతూహలపడుచుండెను. ఆ ప్రవరుని నోట వెలువడు నమృతంపు పలుకుల విని నువ్విళ్ళూరుచుండెను. మోక్ష సుఖములఁ బడయుట కాతఁడే చేయూత యని విశ్వసించుచుండెను. కాని రాచరికమును వెనుకకు నెట్టి సామాన్య మానవుని వలె నాతని కడకేగుట కాతని మన స్సొప్పకుండెను. అందుచే నొకపరి దర్శన మీయవలసినదని చైతన్యునికడ కొక వార్తాహరుని బంపెను.

కాని చైతన్యుఁ డిట్లు చెప్పి పంపెను: "నేను సన్యాసిని. సర్వసంగ పరిత్యాగిని. రాజులు మత్తులు. అట్టివారితో నాకుఁ బ్రమేయము లేదు. కనుక నే నాతనిఁ జూడఁజాలను."

ప్రతాపరుద్రుఁడు తిరుగ నిట్లు చెప్పి పంపెను. "జగ్గాయి, మద్దాయిలు బందిపోటు దొంగలు గదా ! అట్టివారినే మీ సన్నిధినిఁ జేర్చుకొనినపుడు, ప్రతాపరుద్రునిఁ జూడ నేల నిచ్ఛగింపరు ? వారికంటె నీతఁడు గుణహీనుఁడా ? ప్రతాపరుద్రుఁ డొకఁడే వర్జనీయుఁడా ? మీ కటాక్ష వీక్షణముల రక్షింపబడ దగఁడా ?"

అంతఁ జైతన్యుఁడు "మిగుల శోచనీయము; ప్రతాపరుద్రుఁడు సకలసద్గుణఖనియేఁ గానోపు. కాని కడివెడు గంగగోవు పాలయం దొక చుక్క సారాయముఁ గల్పినచో నది వర్జనీయ మైన చందముననే ప్రతాపుఁడు రాజైన కారణమున దగ్గఱఁ జేర్పఁదగడు" అని చెప్పెను.

ఆ తిరస్కృతికిఁ బ్రతాపరుద్రుఁడు మిగుల వెత నొందెను. కాని యాతని కా విశిష్టభక్తునిఁ గాంచు కుతూహల మినుమడించుటచే జగన్నాథమునందలి రథోత్సవమునకొక సామాన్య యాత్రికుని వలె యాతఁ డరిగెను. పద్యములు, పాటలు, శ్లోకములు నందు కడు రమ్యముగఁ బాడుచుండిరి. చైతన్యుఁడా కీర్తనములు వినుచు భక్తిపారవశ్యమున మైమఱచి పోయెను. ప్రతాపరుద్రుఁడు చెంతఁ జేరి వీవనతో వీచుచు సపర్యలఁ జేయసాగెను. స్మృతి వచ్చిన వెనుకఁ జైతన్యుఁడా

రాజశేఖరునిఁ గౌఁగలించుకొని, "సోదరా! ఈ నీ యపార ప్రేమకు బ్రత్యామ్నాయముగ నే నేమి యొసఁగఁ గలను. ఇదిగో యీ యాలింగనము మాత్రమే" యని నుడివెను. అంత నా భూపాలుఁడు "స్వామీ! ఇన్ని వత్సరములుగఁ జాతకపక్షినై మీ కరుణచంద్రికల కొఱకై యెదురు చూచు చుంటిని. నేటికిఁ గృతార్థుఁడనైతిని. నేను ప్రతాపుఁడను." అని తెల్పెను. "రాజులతో నాకుఁ బనిలేదు. నీవు రాజువై నా చెంత కరుదెంచలేదు. తోడి భక్తుఁడవైతివి. గోవిందా! గోవిందా! యనుము" అని యనఁగనే ప్రతాపరుద్రుఁడును, జుట్టుమూగిన ప్రజాసమూహమును గోవిందనామ సంకీర్తన మొనర్చిరి.

## 4. చైతన్యుని మహోపదేశము

"జీవితమును దృణప్రాయముగ నెంచువాఁడే భగవద్దర్శ నార్హుఁడు. ఆకలిదప్పుల కలమటింపరాదు. జరామరణములకు జడియరాదు. జీవితము నొకపరి కృష్ణార్పణ మొనర్చిన వెనుక దానితో మఱల నీకెట్టి సంబంధమునులేదు. తద్రక్షణ భార మంతయు నా పరమాత్మునిదే కాన భయ సంభ్రమ ములు వీడుఁడు. భగవదారాధనమున కాలముఁ గడుపుఁడు." ఇదియే శిష్యులకుఁ జైతన్యుని మహోపదేశము. అనుక్షణ మును దీనినే బోధింపుచు నాచరణయం దుంచునట్లు చూచు చుండెను. గురుశిష్యులు తమ భక్తకోటి యొసగిన దాని తోడనే నిత్యమును సంతృప్తి జెందుచుండిరి. దాచిపెట్టు కొట్టిదియో వారెఱుఁగరు.

ఒకనాఁడు వారొక తురకపల్లియ కరిగిరి. తిలకమున కామలక మందు దొరక దయ్యె. యువకుఁడగు శ్రోత్రశిష్యుఁ డొకఁడు తనయొద్ద నొకటి గలదని చైతన్యునితో నుడివెను. ఎవ రొసగిరని యా స్వామి యడుగఁ "నిక్కడెవ్వరును దెచ్చి యీయలేదు. ఇది యొక తురకపల్లియగదా! మన కిందు లభింపదని యెంచి నిన్నటి దిన మా హిందువుల గ్రామమున వారు మన కొసగిన యామలకములలో నొకటి దాచి యుంచితి" నని యుత్తర మొసఁగెను.

అప్పలుకులకుఁ చైతన్యుఁడు "కుమారా! రేపటికి గావల యునని యేదియును దాచుకొనరాదని యెన్నియో సారులు నుడివితినిగదా! కూడఁబెట్టు నాలోచనయే తగదని చెప్పి తినిగదా! నీవు సన్న్యాసిగ నుండఁగోరుటకంటె గృహస్థుఁ డవుగ నుండదగుదువు. నన్ను వదలుము. పెండ్లి జేసికొని కుదుటఁ బడుము, అని నుడువగనే యా యువకుఁడు విలపింపసాగెను. క్షమింప వేడెను. తన్ను చేయి వదలవలదని ప్రార్థించెను. కాని చైతన్యుఁడు "నీవు మా యాశ్రమవిధులను భగ్న మొనర్చితివి. నాదండ నీ వుండఁజనదు. కాని చింతపడకుము. నీవు కోరినపు డెల్ల నాకడకు వచ్చుచుం బోవుచుండుము. తొలుత నుద్వా హము జేసికొనుము. చక్కగ నీ యిష్టమువచ్చినట్లు ధర్మ మార్గమున ధనము నార్జించుకొనుము. తరువాత సన్న్య సింపుము" అని యుపదేశించి వాని నోదార్చి పంపివేసెను.

కొన్ని దినములైన వెనుక చైతన్యుఁడు తన పరిజనులతో నుద్దియకడ విడిసెను. జగ్గాయి, మద్దాయియను మారుపేర్లుగల

జగన్నాథుఁడు, మాధవుఁడను గొప్ప దోపిడిగాండ్రును నందే నివసించుచుండిరి. వారు కులమున బ్రాహ్మణులే కాని మాంసాశనులు. మద్యపాన నిరతులు. కఠినహృదయులు. వేలకొలది ప్రజలను దోచిరి. వేలకొలది కుటుంబములను నిర్మూలించిరి.

చైతన్యశిష్యులు నిత్యానంద హరిదాసులు వారికి హృదయ పరివర్తన మొనర్చి సన్మార్గమునకు ద్రిప్పనుంకించి వారియింటి కేగిరి. జగ్గాయి, మద్దాయి లిరువురును ఇంటియొద్ద ఒడలెఱుఁగని మైకమున, చెంత నించుమించుగ ఖాళీయైన కల్లుకుండతో నడవలోబడి దొర్లుచుండిరి. చైతన్యశిష్యు లిరువురును వారితో "గోవింద నామస్మరణ మొనర్పుఁడు. మద్యమును మానుఁడు. దొంగతనమును వదలుఁడు. ద్వేషములఁ బాఱద్రోలుఁడు. హరిని స్మరింపుఁడు. మీ జీవితములను సత్యపథముల నడపు" డని బోధించిరి. అప్పలుకులు వారికి వాడిశూలము లయ్యెను. పట్టరాని కోపముగల్గించెను. జగ్గాయి యా ఘటమును నిత్యానందుని నడినెత్తిపై విసరికొట్టెను. అది ముక్కలు ముక్కలుగఁ బగిలిపోయెను. నిత్యానందునకు గాయము తీవ్రముగఁ దగిలెను. చెక్కిళ్ళపై రుధిర ధారలు గారఁదొడగెను. మద్దాయియును లేచి హరిదాసుని చావగొట్టెను. నిత్యానంద హరిదాసు లిరువురును స్పృహఁదప్పి నేలఁబడిరి.

ప్రేక్షకులు కొందఱు చైతన్యుని చెంతకుఁ బరుగిడి జరిగిన వృత్తాంతమునెల్ల నివేదించిరి. ముస్లిముపరిపాలకుని సాయము గొని తన యనుచరులఁ గాపాడుమని వేడిరి. కాని చైతన్యుఁడు

తా నెవరి సాయముఁ గోర ననియు, దానే యచ్చటికి వెళ్ళెద ననియు నుడివి, జగ్గాయి మద్దాయిల గృహమునకుఁ బయనమాయెను. ప్రభుత్వ సాహాయ్యము లేక యొంటరిగ నే వచ్చుచున్నాననియు, దన్నును గొట్ట కట్టెలు, కుండలు సిద్ధపఱచుకొని యుండు డనియు దొంగలకు వర్తమాన మంపెను. ఆ దుర్మార్గు లిరువురు నా మహనీయుని ధైర్య సాహసములకు కచ్చెరు వందిరి. ఆ తేజోమూర్తి దివ్యసుందర విగ్రహమును, ప్రేమభరిత నయనములను, నిర్భయ దృక్కు-లను గాంచినంతనే వారి మనసు మారిపోయెను. తమ దౌష్ట్యములకుఁ జింతించిరి; పశ్చాత్తప్తులైరి. "మిమ్ము చంపుదు మన మీ కేల జడియుట లే"దని జగ్గాయి యనంగ, స్వామి యాతని కిట్లనియె: విధ్యుక్త ధర్మ నిర్వహణ దీక్షలో నాకీ జీవితము తృణప్రాయము. ఈ శరీరము నాది గాదు. శ్రీకృష్ణపరమాత్మునిది. దీనిని రక్షించుభార మాతనిదే. భగవద్భక్తులు బందిపోటుదొంగలకు భయపడుదురా! ఆ పరంధాముఁడు తలఁచినమాత్రముననే మీబోంట్ల నెందఱి నైనను త్రుటికాలమున సమయింపఁజేయఁగలఁడు సుమా! ఆతని భక్తులను బాధించినచో మిమ్మూర కాతఁడు విడిచి పుచ్చునని తలంపకుఁడు."

అప్పుడే స్మృతిఁ బొందిన నిత్యానందుఁడు చైతన్యుఁ గాంచి, "వారిని క్షమింపుఁడు. నా కెట్టిబాధయు లే" దని ప్రార్థించెను. హరిదాసుఁడును "నాకీ దెబ్బ లా మాధవుని ప్రసాదములే! వారిని మన్నింపుఁడు"అని వేడుకొనెను. అంత

నా యిసువృసు చీకఁటిం దొరలుచుఁ జైతన్యుని పాదములపై (వ్రాలి, "మా యిచ్ఛావచ్చినటుల మమ్ము శిక్షింపుఁడు, మీచేఁ జచ్చినను సరియే వెనుఁదీయము. అది మాకు న్యాయ్యతయే. గౌరవనీయము లగు కుటుంబముల జన్మించిన బ్రాహ్మణుల మైనను బ్రహ్మబంధులమే. నీచ ధనకాంక్షచే మానవుఁ డీ ప్రపంచమునఁ జేయఁగల్గిన ఘోరాతిఘోర దుష్కృత్యము లెన్ని గలవో యన్నింటిని జేతులారఁ జేసితిమి. పాపముల నొడిగట్టుకొంటిమి. మద్యసముద్రమున నిరంతరము మున్కలు వేయుచుంటిమి. అబ్బా! ఎంతటి పాపులము! ఎంతటి దౌర్భాగ్యులము! ఓ పూతచరితా! పుణ్యమూర్తీ! మాకీ భయంకర పైశాచిక వ్యాధినుండి ముక్తి కేమైన మందు గలదా" అని కన్నీరుగార్చుచుఁ బరితప్త హృదయములతో నా మానవులు ప్రార్థించిరి. అంత నా దివ్యమూర్తి "మిత్రులారా! కలదు. వాపోవకుఁడు, మానవుల రోగముల కన్నిటికిని మందు గలదు. ఉత్తమోత్తమమైన మందున్నది. దానిని సేవించి నచో నిహపరములలోని రోగము లెల్ల బాయును. అదియే గోవిందనామము. అదియే మోక్షద్వారము. ఎంతటి నిబిడాంధకార బంధుర నిశీథమైన నొక్క మెఱుపుచే దేదీప్యమానముగ వెలుగొందుటలేదా!" అని యుపదేశించి వారిని లేవనెత్తి యాలింగన మొనర్చుకొనెను. మధుసేవకులు మాధవ సేవకులుగ మారిరి.

చైతన్యుని పర్యటనములలో వసుదేవుఁడు దన్నుఁజూడ వచ్చెను. వసుదేవుఁడు విప్రుఁడు. కుష్ఠురోగి, కడు నసహ్యా

కరముగ నుండుటచే దురదుఁ జండాలురు సైతము చూడ సేవగించుకొనుచుండిరి. అంటుజాడ్యమని దూరదూరముగఁ దొలగిపోవుచుండిరి. చైతన్యుంగాంచి యా వసుదేవుఁడు దూరమున నిలువంబడి 'గోవిందా! గోవిందా!' యని భక్తిపారవశ్యమున నుడువఁదొడగెను. ఆ మహానీయుఁడు వెంటనే యాతనికడకు బరువిడి కౌఁగలించుకొనెను. అంత నా వసుదేవుఁడు "స్వామీ! స్వామీ! నే నొక కుష్ఠురోగిని. దౌర్భాగ్యుడను. చండాలురు సైతము నన్ను రోయుదురే! మీరపారకరుణారసపూరిత హృదయులై యాలింగన మొనర్చి నన్నాశీర్వదించితిరే" అని ముదిత మనస్కుడై నుడివెను. అంత నా దివ్యమూర్తి 'సోదరా! కృష్ణభక్తులు కుష్ఠునకు వెఱతురా? నీ బాహ్యరోగము నన్నేమియు చేయదు. నీ పరిశుద్ధాంతరాత్మయే నీకు శరణ్యము. మోక్షదాయకము' అని ప్రీతిమై బల్కెను.

చైతన్యుఁ డొకపరి యొంటరిగా నూరినుండి బృందావనమున కరుగుచుండెను. మార్గమధ్యమున భక్తిపారవశ్యమున నెఱుఁక సెడి క్రిందఁబడెను. కొందరు తెరువరు లది గాంచి ఆ మహానీయునకు సాయపడు సంకల్పమున నాతని దరి కరగి పట్టుకొనిరి. పఠానుసైనికు లామార్గమునఁ బోవుచు, నయ్యుపకర్తలు చోరు లని భావించి వారింబట్టి కాలుసేతుల బంధించిరి. చైతన్యునకు స్పృహవచ్చిన వెనుక నా భటులఁ గాంచి యామందభాగ్యులు బంధములఁ బొందుటకంటె బహుమతులఁ బొందుటకే తగిన వా రనెను. ఒక యిస్లాం మతాచార ప్రవిష్టునితోడను, నాసైనికులతోడను భగవంతునిఁగూర్చియుఁ

దన్మహిమనుఁ గూర్చియు జర్చించి వారికి హృదయ పరివర్తనమునుఁ గలిగించెను. "మహమ్మదీయులను మతాంతరులనుఁ జేయుట మహాదారుణము ; వారిని విడలుఁ"డని యొక తెరువరి యనెను. అందులకుఁ జైతన్యుఁడు "వారిని మతాంతర ప్రవిష్టులనుఁ జేయుటచే నొక్క ప్రాణికైనను ముప్పు గలుగదు. లేకున్న నెందఱో ప్రాణులు మడియవలసివచ్చును" అని యనుచు "గోవిందుని భజింపుఁడు. భయమును వీడుఁడు" అని యుపదేశించెను. అందఱును గోవిందుని భజించిరి. ఆ నాటినుండియు నా మతాంతరప్రవిష్టులైన మహమ్మదీయులు పఠానువైష్ణవు లని పిలువబడుచుండిరి.

చైతన్యుఁ డొక బౌద్ధసన్యాసి నొక యడవియందు గలసికొనెను. వానితో మతవిషయములఁగూర్చి తర్కించి పరాజితుఁ జేసెను. ఓటమినొందిన భిక్షుకుఁడును నాతని యనుచరులును కిన్కవహించి పగదీర్చుకొన నెంచిరి. గోవింద ప్రసాదమని నుడువుచు విషాన్నము నా మహామహున కొసఁగిరి. చైతన్యుఁడు ముందు వెనుక లాలోచింపక దాని భుజింపఁబోవుచుండ నాతని సహచరులలో నొకఁడు "స్వామీ! వీరు విశ్వాసదూరులుగ నున్నారు. ఈ భోజనమును మానుఁ"డని ప్రార్థించెను. "ఎంత మూఢత్వము! మనల నదేమిచేయును? ఎంతటి కాలకూటవిషమైననుసరియే గోవిందనామ స్మరణమున నమృత మగును. గోవిందుని భజించుచు భుజింపుడు. ఎట్టి దొసఁగులునురానేరవు"అని చైతన్యుఁడునుడివెను. అందఱును గోవిందా! గోవిందా!' యనుచు బిగ్గఱగ నఱచిరి. చైతన్యుఁడు

తోలికబళము నోట నిడుకొనఁబోవు సమయమున నా మహా భక్తుని భక్తివిశ్వాసములు ఆ బౌద్ధులమనమున హత్తుకొనెను. అంత వారు పశ్చాత్తప్త హృదయులై యా దివ్యమూర్తి పాదములపై వ్రాలి, "అయ్యా! క్షమింపుడు. ఇది విషపూరి తాహారము. దీనిని ముట్టకుఁ"డని దానిని వేసివైచిరి. అంద ఱునుఁ గలసి మంచి యాహారమును భుజించిరి. గోవిందుని భజించిరి. ఆనాటి నుండియు నా బౌద్ధులు చైతన్య శిష్యులైరి. చైతన్యుఁడు నలుబదియెనిమిది వర్షముల ప్రాయముగలవాఁ డయ్యెను. వయసువలె దైవభక్తియు నానాటి కపార మాయెను. ఒకనాఁడు దేవుని భజింపుచు సముద్రములోనికిఁ బోవఁజొచ్చెను. నారాయణునిఁ గాంచ నెంచెను. శిష్యు లెంతయో ప్రయాసమున నాతనిఁ బట్టి తెచ్చిరి.

మఱల నొకపరి జగన్నాథాలయమున దేవుని ముఖాముఖిఁ గాంచ నెంచి, "దేవా! దేవుఁడు లేఁడని కంపముగుఁ బగులఁ గొట్టిన రాక్షసుఁ డగు హిరణ్యకశిపునకు దర్శన మొసగితివే! నిన్ను నమ్మి భజించు భక్తులకుఁ గనఁబడవా?" యనుచు నందలి రాతి స్తంభమునకుఁ దన తల గట్టిగ ఢీకొట్టెను.

భజన సంఘములతో గలసి యెగురుచు, నాడుచు, బాడుచు, రేయనకఁ బవలనక, నుట్టయనక, మిట్టయనక, రాయి యనక, రప్పయనక నిరంతరము భజనలుఁ జేయుచుండెను. ఒకరాయి యాతనికాలిలో గ్రుచ్చుకొనిపోయెను. వెంటనే తీసివేసి చికిత్స చేయలేకపోవుటచే నచ్చోట చీము పట్టెను.

అది నానాటికి పెద్ద పుం డయ్యెను. తుదకు దానిచేతనే నా మహామహుండు దివంగతుం డాయెను. అవసానకాలమున శిష్యులు కొందఱు "ఓ పూజ్యపురుషా! తమజీవితము నింత నిర్లక్ష్యము చేసితిరేల?" యని యడుగఁ జైతన్యుం డిట్లనియె: "తటాకము నీటిని పొదుపుజేసికొనుట కుపయోగపడును. అటులనే ఈ శరీరముగూడ భగవంతుని యాలయముగ నుపయోగించుకొనవలయును. నీరులేని చెరువును, నామస్మరణ ధ్యానములేని తనువును రెండును నిరుపయోగములే. కనుక, శిష్యులారా! జీవితమును తృణప్రాయముగ నెంచుడు. చతుర్వేదపారగుని మొదలు చండాలునివఱకును శ్రీకృష్ణ పరమాత్ముని మహోపదేశములను బోధింపుఁడు. అరిషడ్వర్గములకు దూరులు గండు. సంభ వాసంభవముల సరకుఁ జేయకుఁడు. క్షణభంగురమైన యీ జీవితమే శాశ్వతమని విశ్వసింపకుఁడు. అనంతజీవనదాయకుఁడగు నా యనంతుని, గోవిందుని గట్టిగ నమ్ముఁడు." అనుచు నసువులఁ బాసెను.

## 5. సత్యప్రబోధము

బలరాముఁడు తన మతగురువు కడకేగి "హిందూ దేవాలయములను ధ్వంసమొనర్చిన ముస్లిములను మనము నిందింపఁదగదా?" యని యడిగెను. ఆ మతోద్ధారకుఁడు, "రామకృష్ణుని యనుభవము నొక్కటి నుడివెద వినుము. అతఁడొకనాఁడు కాళికాదేవి యాలయము శిథిలమైయుండుటఁగాంచి కడు పరితపించెను. అది యెన్నడో ముస్లిములచే ధ్వంస

మొనర్పఁబడినదనియు, నాటినుండియు నట్టి శిథిలావస్థయందే యుంచఁబడినదనియు నెఱింగి, కన్నీరు మున్నీరుగఁ బ్రవహింప విలపించుచు 'ఓమాతా! నే నప్పుడు జీవించి యుండినచో నీ యాలయమును దప్పక గాపాడియుందునుకదా' యనుచు మైమఱచెను. అప్పుడా దుర్గ ప్రత్యక్షమై 'పుత్రా! మన యిరువురిలో బలవంతు లెవరు? నీవా? నేనా?' యని యడిగెను. 'అమ్మా! యడుగనేల? నీ వనంతశక్తివి, నే నత్యల్పుఁడను. మన యిరువుర కేమాత్రమైన సామ్యమున్నదా?' యని రామకృష్ణుఁ డనియెను. 'అటులైనచో నా యాలయమును రక్షించుకొను తలం పేమాత్రమైన నా కున్న నేనే కాపాడుకొనియుందును గదా! నీ సాయము నా కేల?' అని యా యంబ యనియె. 'జననీ! అవు నవును. అటులైనచో దాని నేల శిథిలముఁ గానిచ్చితివి?' అని రామకృష్ణుఁ డడుగ, 'అందఱును నా పిల్లలే. కొందఱు నా కొఱకై గృహములు నిర్మింతురు. కొందఱు నాశన మొనర్తురు. రెండును నాకు సంతసములే. బాలచేష్టలు మాతాపితరుల కానందదాయకములే కదా! కావున నీవు వారిని దూరకుము" అని కాళి మందలించెను.

అంత బలరాముఁడు "దేవుఁడైనను, దయ్యమైనను సరియే తనకై భక్తులు నిర్మించిన మందిరముల నన్యమతస్థులు నాశన మొనర్చుచుండ నూరకుండు టెంతమాత్రము సమంజసము గానేరదు. నిశ్చయముగ నెన్నటికిని సమంజసముఁ గాదు" అని వాదించెను. అంత నా మతగురువు "ఓహో!

స్వీయోద్దేశ్యముల నణచుకొని, భక్తునకు మంచిదని తోఁచిన యభిప్రాయములనే భగవంతుఁ డనుసరింపవలయునా?" యని ప్రశ్నించుచు, "భక్తులకుఁ దనయింటి పెద్దఱికమంతయు నప్పగించు త్రాగుబోతు ప్రభు వనుకొంటివా భగవంతుఁడు? భక్తితోఁ దన కర్పించిన పుష్పము వాడినదైనను దానిఁ బ్రేమతో స్వీకరించును. తనభక్తు లొనర్చు కార్యములు దుష్కృత్యములనిఁగాని, సత్కృత్యము లనిఁగాని యను కొనఁడు. సోమనాథాలయము గాని, శాంతసోఫియా గాని, కార్డోవా మశీదుగాని, జెరూసలమ్ చర్చిగాని అన్నియు నేదో యొకదినమున శిథిలములు గావలసినవే. వానిఁ బోఁ గొట్టుకొనువారు భక్తులేగాని భగవంతుఁడు గానేరఁడు" అని యుపదేశించెను.

## 6. సత్యపథము

"భగవంతుఁడు సర్వాంతర్యామి యైనపుడు మన మన్ని వస్తువుల నేల భుజింపరాదు? శాకమును భుజించినపుడు, మాంసమునుమాత్ర మేల వర్జింపవలయును? జలమును త్రాగునపుడు సారాయముల నేల త్రోసిపుచ్చవలయును? భార్యలపొత్తు ఉచితమైనపుడు వెలయాండ్రనుమాత్ర మేల నిషేధింపవలయు?" నని బలరాముఁడు తన గురువు నడిగెను. "చక్రి సర్వోపగతుఁడను సూత్రమును జాలకాలముక్రితమే శ్రీ రామకృష్ణపరమహంస యీ చిన్న నిదర్శనముచే విశదీకరించెను. చెప్పెద వినుము." అని యా గురుపుంగవుం డిట్లు చెప్ప

దొడఁగె: "భగవంతుఁ డన్ని జీవులయందును నిండియున్నాఁ"
డని యొక స్వామి తన శిష్యులకు బోధించెను. వారిలో వితండ
వాదియు, మూర్ఖుఁడు నైన శిష్యుఁ డొక డమ్మాటలను విప
రీతముగ నర్థము జేసికొనెను.

"ఒకనాఁడాతఁడు తన సహపాఠులతో వీధినిఁ బోవుచుండ నొక మదపుటేనుఁ గెదురుగ పరుగెత్తికొని వచ్చుచుండెను. 'తొలఁగుఁడు, తొలఁగుఁ'డని మావటీఁడు కేకలు వేయసాగెను. తోడివిద్యార్థు లెల్లరు వెంటనే పైదొలఁగిరి. వానిం గూడ తమ వెంట రమ్మని బ్రతిమాలిరి. కాని యా వితండవాది 'దేవుఁడు సర్వవ్యాపి' యని మన గురువుగారు బోధించిరి. 'భగవంతుఁడీ యేనుఁగునందునుగలఁడు. అతఁడు మనకెట్టి హానియును జేయనొల్లఁడు. కావున నీ హస్తియు మన కెట్టి యపకారమును జేయ'దని తొలఁగిపోవ నిరాకరించెను. మావటి దానిని స్వాధీనములోనికిఁ దెచ్చుకొను లోపుననే యా మదగజ మాతనిఁ దన దంతములతోఁ దీవ్రముగఁ గాయపఱచెను. రక్తము ధారలై స్రవింప నా మూర్ఖుఁడు గురువు కడ కేగి "ఆచార్యా! దేవుఁడు సర్వాంతర్యామియని ప్రవచించితిరి కదా! ఆ గజాంతర్యామి యగు భగవంతుఁడు నన్నేల హింసించునని దలంచితిని. కాని నా నమ్మిక వమ్మైనది" అని విలపింపసాగెను. అంత నా గురువర్యుఁడు "పుత్రా! మావటివానిలోను, నీ సహపాఠులలోను గల భగవంతుని మాటల నేల పెడచెవి నిడితివి? ఆ మదగజములోని దేవునిమాత్రమే యేల నమ్మితివి. అదియే నీ దుఃఖమునకుఁ గారణము. ఏదైన సత్యపథము ననుసరింపవలయు ననిన ముందుగ దానిని పూర్తిగ

సర్థముఁ జేసికొనవలయును. అటులఁగానిచో వదలివేయుట మంచిది. అగ్రావగాహన మూపదలకుమూలము." అని హితబోధ యొనర్చెను. బలరాముఁడును, గురువచనముల నాలించి ధన్యవాదము లర్పించి వెడలిపోయెను.

## 7. గురుని యావశ్యకత

"తత్త్వవేత్తయగు గురుని యావశ్యకత యేమి ? అతఁ డెట్లుపకరింపఁగలఁ"డని బలరాముఁ డొకనాఁడు గురువును ప్రశ్నించెను. "శ్రీ రామకృష్ణుఁడు దానికి నొక నిదర్శనమును జూపెను. అది చెప్పెద విను"మని యా గురుపుంగవుఁ డిట్లు నుడువ దొడంగెను : "ఒకనాఁడు రామకృష్ణుఁడు గంగానదీ పులినతలంబున విడిసియుండెను. అప్పు డొకఁ డీ ప్రశ్న నే యడిగెను. అత్తఱి నావ యొకటి నదిలోఁ బోవుచుండెను. దాని కొక పొగ యోడ తగిలింపఁబడియుండెను. 'ఆ పడవ యెంత వేగముగ బోవుచున్నదో గాంచితివా ?' యని రామ కృష్ణుఁ డడిగెను. 'ఆ పొగ యోడ వేగముననే యా పడవయు నేగుచున్నది. ఇప్పుడు దాని గమనము సుమారు గంటకు పది మైళ్ళుండును' అని యాతఁడు ప్రత్యుత్తర మొసఁగెను. 'ఆ యోడను తగిలింపకున్న నా పడవ యొక్కటియే యెంత వేగమున బోఁగలదు ?' అని రామకృష్ణుఁడు మరల నడిగెను. 'గంటకు సుమారు నాల్గుమైళ్ళుమాత్రమే' యని యా శిష్యుఁ డనెను. 'ఆ యోడ సాయమున్నచో నాపడవ సురక్షితముగఁ బ్రయాణము చేయఁగల్గునా ? లేకున్నను ప్రయాణము సాగించునా ?' యని రామకృష్ణుఁ డడుగ 'లేదు. ఓడసాయముననే అది సురక్షితము' అని యా శిష్యుఁ డనెను.

'బాగున్నది. అటులైనచోఁ ప్రాథమిక వేదాంత విద్య యూ పడవవంటిదే సుమా! గురుసేవ యనునది పొగయోడ వంటిది. భగవంతుని సాన్నిధ్యము సురక్షితముగను, సుగమముగను, శీఘ్రముగనుఁ జేర్పఁగల్గును' అని రామకృష్ణుఁడు నుడివెను.

అంత నా పృచ్ఛకుఁడు 'అట్లగుచోఁ గొందఱు గురువులు సత్వరముగ గమ్యస్థానమును జేరలేక పోవుచున్నా రేల?' యని మరలఁ బ్రశ్నించెను. దానికి రామకృష్ణుఁ డిట్లుపదేశించెను. 'అందు విచిత్ర మే మున్నది? ఎన్నియో రకముల గురువు లుందురు. ఎద్దుబండివలె గొందఱుందురు. జట్కాబండి వంటి వారు కొంద ఉందురు. పొగబండివంటివారు కొంద ఉందురు. వాయువిమానము వంటివారు కొంద ఉందురు. విద్యుత్ కాంతినిఁ బోలినవారు మఱికొంద ఉందురు. ఇట్టి రకముల వారిలో నీవు గురువు నన్వేషించునపుడు సద్గురువునే యెన్నుకొనవలయును. దానిపైననే భద్రతయు, జ్ఞాన సముపార్జనాగతియు. గమ్యస్థానప్రాప్తియు నాధార పడియుండును. గురువులేని మార్గము దుర్గమము. పాదచారులై పలుబాముల బడవలసివచ్చును. ఒక్కొకతరి మార్గమధ్యమున నెన్నియో యవాంతరములు వాటిల్లి గమ్యస్థానమునుఁ జేరలేకఁ బోవచ్చును.

## 8. వింత యధ్యక్షుఁడు

అల్లిబిల్లయ్య యొక సభ కధ్యక్షుఁ డాయెను. సభికుల ప్రశ్నల కుత్తరములు చెప్పుచుండ నొకఁడు లేచి "వేఱొందు

లోకముఁ గలదా?" యని ప్రశ్నించెను. "అట్లున్నటుల నాకుఁ దోచినచో నేనుఁజెప్పియుండెడివాఁడనే. కాని నేనట్లు జెప్ప" నని యాయధ్యక్షుఁ డుత్తర మొసఁగెను. అంతనాపృచ్ఛకుఁడు "వేఱులోకము లేదని మీరు తలఁచెదరా?" యని మఱల నడిగెను. "నేనటులఁ జెప్పలేదు. వేఱొండు లోకము లేదని నే జెప్పలేదనియే చెప్పితిని. అటుల మరియొక లోకములేదని నేఁ జెప్పను. అది యున్నట్లును నేఁ జెప్ప"నని మఱల నాతఁడు జవాబిచ్చెను. అంత నాసభికుఁడు "వేఱులోకముండినను లేకుండినను మనకు దానితోఁ బనిలేదని తలఁచెదరా?" యని మఱల నడుగ "నే నటులనుఁజెప్పలేదు. నే నట్లనుకొని యుండినచో నట్లే జెప్పియుండెడివాఁడను. నేనటులఁ జెప్పను. దానిని నే నొప్పుకొనఁజాలను. అటులనని దానిని నేనుఁద్రోసి వేయను" యని యాయల్లిబిల్లయ్య యుత్తర మొసఁగెను. "అటులైనచో మీరేమి చెప్పెదరు?" అని యా సభ్యుఁడు మఱలఁ బృచ్ఛించెను. "నే నిదియుఁజెప్పను అదియుఁజెప్పను. అటు లున్నట్లును నేననుకొనను. లేనట్లును నేననుకొనను" అని, యా యధ్యక్షుఁడు అల్లిబిల్లయ్య నుడివెను.

## 9. మానవశక్తి యల్పమైనది

"నా శక్తిసామర్థ్యము లెట్టివి? అసమానములు. నా యైశ్వర్య మెట్టిది? కుబేరుని కాలఁ దన్నునది. నా యధికార మెట్టిది? దేవేంద్రాధికారమును మించినది" యని యక్బరు చక్రవర్తి యొకనాఁడు తనలోఁ దా ననుకొనుచు నిండోలగంబున నాసీనుఁడై యుండి సభ్యులం గాంచి, "నాశక్తి

కతీతమైన దేద్దైన నీ భువిఁ గలదా ?" యని గంభీరముగ, సగర్వముగఁ బలికెను. అంత నాస్థాన విదూషకుఁడు వీర బలుఁడులేచి, "ప్రభూ! పసిపాపనుగూడ తృప్తిపఱచు శక్తి నీకు లేదు సుమా!" యనియెను.

"ఏమిరా! ఇంత సామ్రాజ్యాధినేత నైన నేను చిన్నబిడ్డల కోర్కెలఁ దీర్పఁజాలనా ?" యని యా సార్వభౌముఁడు కుపితుఁ డాయెను.

"ఓ ప్రభూ! నా పలుకులు సత్యములు. కావలసినచో పరీక్షింపుఁడు. రేపే ప్రయత్నింతము. నేనే చిన్నబిడ్డవలె నటించెదను" అని వీరబలుఁడు సవాలుఁ జేసెను.

అటులనే యని యక్బరానాఁటికి సభఁజాలించెను. బిడ్డలకు సంతృప్తి గల్గించుటకై కావలసిన వస్తుచయము నెల్ల సమ కూర్చెను. పెద్ద పెద్ద పాలడబ్బాలను, రకరకములు తిను బండారములు, మధురాహారములు, చిత్ర విచిత్రపు టాట వస్తువులను సిద్ధము చేయించెను.

మఱునాఁటి యుదయమున నిర్ణీతకాలమున వీరబలుఁ డొక యూయెలలోఁ బరుండబెట్టబడి రాజుకడకుఁ గొనిరాఁ బడెను.

"నీ కేమి గావలయు"నని సార్వభౌముఁ డడిగెను

"ఇప్పుడే పిదికిన యావుపాలుఁ గావలయు"నని యానటుకుఁ డడుగ వెంటనే కామధేనువువంటి యావును బిదికించి యొక

శేను పాలను తెప్పించి "నీ కింకను నేమి గావలయు" నని యా భూపాలుఁ డడిగెను. వీరబలుఁ డేడ్చుచు "నా పాలను మఱల నాయావు పొదుగుననే యుంచు" మని నుడివెను.

ఆమ్మాటలకుఁ జక్రవర్తి స్తబ్ధుడాయెను; మానము వహించుట చేతనే తన యోటమి నొప్పుకొనెను.

## 10. స్వేచ్ఛా గానమాధురి

తానాసేన సుప్రసిద్ధ సంగీత విద్వాంసుఁడు. అక్బరు చక్రవర్తి యాస్థానగాయకుఁడు. అతని సంగీతపాటవమునకుఁ గడు సంతసించి ముగ్ధుఁడై, "ఈ భూలోకమున నిన్ను మించిన పాటకుఁడు మఱియొకఁ డుండఁజాల"డని చక్రవర్తి యొకనాడాతని స్తుతించెను. తానాసేన ఉప్పొంగక, "మీ రాజ్యముననే బృందావనమున నుండు నా గురుస్వామి హరిదాసుగారివంటి మహనీయులు నన్ను మించినవారు పెక్కండ్రుగల"రని పలికెను. "అటులైనచో యథార్థముగ నే పరీక్షించినఁగాని నీ మాటలలోని సత్యాసత్యములను విశ్వసింపఁజాలను. మీ గురువుగారి గానమును వినఁ గుతూహల పడుచున్నాఁడను" అని యని యక్బరు గోరెను.

"రాజుల నా మహనీయుఁడు లక్ష్యపెట్టఁడు. రాజుల కొఱకాతఁ డెన్నటికిని బాడఁడు. కాని యాతనిగానమాధుర్యము నాలింపవలయు ననిన నా వెంట మీరు మారు వేషమున రావలసి యుండును" అని తానాసేన [illegible]

రాజు సేవకుని వేషమున తానాసేన [illegible] వనమునకుఁ బయనమాయెను. స్వామి హరిదాసున [illegible]

స్కరించిరి. తాన్‌సేన్ తన గురువుగారి హృదయంగమగీత మును గానముచేయఁ బ్రార్థించెను.

'తాన్‌సేన్! నా కీ దినమునఁ బాడఁదగు నుత్సాహము లేదు. కావునఁ బాడనొల్లను' అని హరిదాసు నిరాకరింప, తాన్‌సేన్ నొక యుక్తిఁబన్నెను. తన గురువున కింపైన పాటనే తాను గావలయునని తప్పుతప్పులుగఁ బాడదొడఁగెను. హరిదాసాగ్రహావేశుఁడై "ఏమీ! నీ వాపాదుసభలో నుండుటచే హృద్యముగఁ బాడఁదగిన పాటనుఁ గూడఁ బాడుచేయుచుంటివా! ఇదిగో వినుము. నీ పతనము నింకనైన దిద్దుకొనుము." అనుచు బాడి వినిపెంచెను. ఆ రాల్గఱిగించు దివ్యగానము చక్రవర్తికిఁ దన్మయత్వముఁ గల్గింపకుండునా! ఆ గానామృతమును గ్రోలి యత్యంతానంద హృదయమున తాన్‌సేన్ నక్బరు లిరువురును నా గానకళాకోవిదునకు వందనం బాచరించి యింటికిఁ బయనమైరి. మార్గమధ్యమున నా సార్వభౌముఁడు, "నీ వంత రమణీయముగ గాన మొనర్పలేఁ బోవుటకు గారణ మేమి?" యని యడిగెను.

"ప్రభూ! నేను రాజుగారి రామచిలుకను. సమయాసమయములు లేక, ఇష్టానిష్టములుమాని ప్రభువుగారి యానందోత్సాహముల ననుసరింపవలసిన బానిసను. ఆ మహనీయుఁడన్నచో తనకుఁ దానే ప్రభువు. తనకుదానే బంటు. తనకు బాడుకొనవలయునను కుతూహలము జనించినపుడుమాత్రమే పాడుకొనఁగల స్వేచ్ఛావర్తనుఁడు" అని తాన్‌సేన్ ప్రత్యుత్తర మొసఁగెను.

# 11. అర్థసిద్ధి

శంకరుఁ డార్యా శివగురువుల కేకైక పుత్రుఁడు. మూఁడవ యేటనే పితృవిహీనుఁ డగుటచే నార్య ఇనుమడించిన వాత్సల్యమున నబ్బాలుని సాకుచుండెను. తన నోములపంట యనియుఁ, బెన్నిధి యనియు, సుఖముల ప్రోవనియు మనసార భావించి యాతనిఁ బెంచుచుండెను.

ఆమె శంకరునికి బాల్యముననే విద్యాభ్యాసము జేయించి తమ గ్రామమునం దొక దేవాలయమున నెలకొల్పబడిన పాఠశాలకు బంపఁ బ్రారంభించెను. గర్భాష్టమమున నుపనయన మొనర్చెను.

ఎనిమిదవ యేటనే నా యర్భకుని యం దాధ్యాత్మిక బీజములు నాటుకొనెను. తాను సన్న్యాసియైన బాగుగ నుండునని యాతఁడు సంకల్పించుచుండెను. అప్పుడప్పుడు తల్లితో "జననీ! ప్రపంచము సర్వమును రిత్త. కాలము నేల వ్యర్థపుచ్చవలయును?" స్థితుఁడై, దివ్యసుఖదాయకుఁడైన నా భగవంతునే ధ్యానింపవలయును. ఆ మహాపురుషునే నమ్ముకొని యుండవలయును" అని చెప్పుచుండెను. ఆర్య డెందమున కా పలుకులు వాడి ములుకు లగుచుండెను. దగ్గరఁ జేర్చి మూర్కొనుచు వాత్సల్యముట్టిపడ, "తండ్రీ! ఆ మేటి యాలోచనములకు నీవు బసిపాపఁడవు. నాకు నీవు దక్క వేఱు దిక్కు లేదు. వివాహ మాడుము. సంతానముఁ బడయుము. నే నొంటరికత్తెను. సన్న్యసించు నాలోచన మానుము. వంశమును నిలుపుము.

తదుపరి నీ యభీష్టము నెఱవేర్చుటకై సన్న్యసింపుము. బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ, సన్న్యాసము లను చతురాశ్రమములను క్రమముగ ననుసరించుము. ఆర్యధర్మములఁ బాటింపుము" అని నుడువుచుండెను.

అంత నొకనాఁడు శంకరుఁడు, "జననీ! నే నొక సామాన్య మానవుఁడ నని భావించుటలేదు. నన్నే నే నా భగవంతున కర్పించుకొంటిని. నిత్యమును స్వప్నమున నన్నాతఁడు పిలుచుచున్నాఁడు. మాతా! నేను తప్పక సన్న్యసింపవలసినదే; అనుమతి నొసఁగుము" అని ప్రార్థించెను. "పుత్రా! నీవు సన్న్యసించినచో నే మరణించిన నాకు దహనసంస్కారాదికర్మలొనర్చువారెవరు? నీ వనర్హుఁడవౌదువుగదా? నాకు దిక్కెవ్వరు?" అని యార్యాదేవి వారించెను. కాని శంకరుఁడు "తల్లీ శంకింపకుము. ఆ కార్యముల నెల్ల నేనే స్వహస్తముల నెరవేర్తును. ఇదియే నా శపథము. అనుజ్ఞ నిమ్ము" అని వేడెను. కాని యామె యే మాత్రము సమ్మతింపకుండుటచే నిత్య మాతఁడు తన కోర్కె నామె కెఱింగించుచునే యుండెను. అనుదిన మామె త్రోసిపుచ్చుచునే యుండెను.

కొన్ని నెలలుఁ గడచెను. ఒకనాఁ డార్యాశంకరులు కలడి గ్రామమునఁ దమ యింటిచెంతఁ బ్రవహించు ఆళ్వేనదియందు స్నానముఁ జేయఁబోయిరి. అందు మొసలు లధికము. తాన మాడుచుండ నొక మకర మా బాలుని నదీ మధ్యమునకు లాగికొనిపోయెను. పాపము! ఆర్య దిక్కు తెలియక యఱ

చుచు నదీతటమున నిలువఁబడి విలపింప సాగెను. తన తనయుఁడు మొసలి కాహుతి యయ్యె నని గట్టిగ నమ్మి యాతని జీవితాశను వదలుకొనెను. "తల్లీ! యిప్పటి కైన ననుజ్ఞనొసఁగినచో సన్న్యాసినై మరణించి కృతార్థుఁడనయ్యె దను." అని శంకరుఁడు, లబలబఁ గొట్టుకొనుచు కన్నీరు మున్నీరుగ నేడ్చుచుండిన తన యంబ నడిగెను. మొసలివాతఁ బడిన యా వటుఁడు మఱల బ్రదికిరాఁడని తలఁచి యార్య యంగీకరించెను. శంకరుఁడు కృతార్థుఁడ నైతి నని శాస్త్ర విహితము లగు కొన్ని మంత్రము లుచ్చరించి సన్న్యాసి యాయెను. అత్తరి వేఱొంటు మొసలి శంకరునిఁ బట్టుకొనిన మొసలిపై కలియఁబడెను. రెంటనుఁ బెనగులాడుచుండఁ బట్టువదలుటచే శంకరుఁడు బ్రతుకు జీవుఁడా యని వేగ ముగ నీదుకొనుచు గట్టెక్కెను. మాతా పుత్రు లమందా నందమున నొకరి నొకరు పరిష్వంగ మొనర్చుకొనిరి.

ఒకపరి సన్న్యసించిన నెప్పటికిని సన్న్యాసియేఁ గదా! నాఁటినుండియు శంకరుఁడు సన్న్యాసి యాయెను. తన పైతృ కపు టాస్తి యంతయుఁ బరిత్యజించి విచ్ఛిన్న వైదికమత పునర్నిర్మాణ మొనర్చి నలుగడల వ్యాప్తిఁజేయ తన చరి త్రాత్మక యాత్రఁ బ్రారంభించెను. మకర మొక నూత్న చరిత్రను సృష్టించెను. వైదిక మతము నొక నవ్యపథమున నడపుటకు శంకరునకుఁ దోడయ్యెను. అందుచే నది సేతుశీత నగపర్యంత మున్న ప్రాంతములందును భారతదేశమున పరమపవిత్రముగ భావింపఁబడుచున్నది.

## 12. మాతృప్రేమ

కాలక్రమమున శంకరుఁ డపర శంకరుఁ డనియు, మహాయోగి పుంగవుఁడనియు, నాచార్యసత్తముఁ డనియు భారతావనియం దెల్లయెడల స్తుతింపఁబడుచుండెను. ఆయన శిష్యులతో నొకపరి శృంగేరియందు విడసియుండఁ దనతల్లి యార్యాదేవి మరణశయ్యపై నున్నటుల వినెను. అవసానకాలమున నామె చెంత నుందుననియు, నామె మరణానంతరమున తన యాశ్రమ నిబంధనలు నిరోధించినను, సరకు గొనక తప్పక తానే దహనసంస్కారముల నొనర్తుననియు, మును పొకతరి యామె కొనర్చిన శపథమును స్మరించుకొని వెంటనే కలడికిఁ బయనమాయెను. మార్గమధ్యమునఁ దన్నెవరును గుర్తింపకుండ నట్లొంటరియై స్వగ్రామముఁ జేరెను. కేరళదేశమున నాయన కెవ్వరును శిష్యులు లేనందున నొంటరిగనే తన తల్లిని గాంచఁగల్గెను.

కలడిగ్రామస్థులు గాని, చుట్టపక్కములు గాని, కేరళదేశమునందలి స్వశాఖీయ బ్రాహ్మణులు గాని శంకరుని పేరు ప్రఖ్యాతు లంతవఱకును విని యెఱుఁగరు. శంకరుఁడు కాషాయాంబరధారియై తల్లి పాదములకుఁ బ్రణమిల్లి కన్నుల కద్దుకొనుట నాయూరి నంబూద్రి బ్రాహ్మణులు కొందఱు గాంచిరి. 'సన్న్యసించి యొరులకు నమస్కరింపరాదుగదా! అందునను పామరజనులకు ప్రణమిల్లుట యాశ్రమ ధర్మవిరుద్ధము. నీ దోషము మన్నింపరానిది' అని వారడుగ "తల్లిని మించిన దైవము వేఱొండుఁగలదా? మాతృపాదములకంటెను

బవిత్రమైన వస్తువెద్ది?” యని శంకరుఁడు ప్రత్యుత్తర మొసఁగ 'నిది నీ క్రొత్తసిద్ధాంతమా?' యని వా రనిరి. “కాదు కాదు. మతములకెల్లను బురాతనమత మిదియే. జననీజనకులే భగవత్స్వరూపులు. ఇది సర్వ మతములయందును గల ప్రప్రథమ ధర్మసూత్రము” అని శంకరుఁ డనియెను. అంత నా విప్రులెల్ల రేకమై “మా కా పెడమతములతోఁ బనిలేదు. నీవు నిజమైన పరివ్రాజకుఁడ వైనచో సన్న్యాసాశ్రమ నియమముల నెల్లఁ బాటింపవలయును. లేనిచో నీవు లోకము కంటకారము జల్లు కాషాయాంబర వేషధారివే యగుదువు. కనుక దప్పక నుచితగతి నొనర్పుఁ”డని నుడువుచు వెడలిపోయిరి.

వారికిఁ గోపముఁ గల్గింపవలదని యార్య శంకరునిఁ బ్రతిమాలెను. “తల్లీ! అజ్ఞానులను స్తుతించుచు వారి యవ్యక్తపుఁ గోర్కెల కొడఁబడుట యుక్తము గా”దని శంకరుఁ డనియెను. అంత నా యమ “తనయా! నీవు సన్న్యాసివి. సర్వోత్కృష్ట తత్త్వజ్ఞానము నాకీ యవసానమునం దైనను నుపదేశింపుము.” అని యడిగెను. శంకరుఁడు తన యద్వైత సిద్ధాంతములను తొలుత బోధింప యత్నించెను. కాని యవి యామె కందుబాటున లేనటుల గ్రహించి, స్వవిరచిత శివ స్తోత్రమునుఁ బఠించెను. అది వినుచుండగనే “నాయనా! అదుగో రుద్రుడు! లయకర్త! నా దెసకే యరుదెంచుచున్నవాఁడు, భయము పొడముచున్నది. ఆ తేజోమయుని, ఆ భూతేశుని, ఆ నాకేశుని, గాంచఁజాల! ధైర్యము చాలకున్నది. కడు పాపిని. కాపాడుము” అని నుడివెను. శంకరుఁ

డంత తన గోవిందస్తోత్రమును నుడివెను. ఆర్య ముదితయై చిఱునగవు నగుచు, "అన్నన్నా! ఇపు డెంత హాయిగ నున్నది. జగద్రక్షకుఁడు శ్రీమహావిష్ణు వదుగో, నావైపు వరు దెంచుచున్నవాఁడు! దయామయుఁడు! ప్రేమమూర్తి! కృష్ణ భగవానుఁడు! ఇదిగో దర్శన మొసఁగుచున్నవాఁడు. తండ్రీ! నీకు సుఖ మగుఁగాక! పోయెదను. నీ వాడిన మాట మాత్రముఁ దప్పకుము. చేతులార నీవే నా శవమును దహ నము జేయుము" అనుచు నసువులఁ బాసెను.

శంకరుఁడు తల్లి మరణవార్త స్వజనుల కందఱకును నెఱుక పఱచెను. శవమును స్మశానమునకు గొంపోయి దహన మొనర్చుటకు వారి సాయ మపేక్షించెను. కాని వారు నిరాక రించుచు, "నీ వామెకు నమస్కరించుటచే సన్న్యాసాశ్రమ విధులకు భిన్నముగ నిప్పటికే వర్తించితివి. ఇంకను నామెకు దహన సంచయనాది కర్మ లొనర్పఁ దలఁచుచున్నాఁడవు. సర్వసంగపరిత్యాగియే సన్న్యాసి యనఁబడును. వానికిఁ దల్లి దండ్రు లని గాని, యక్కచెల్లెండ్రని గాని, యన్నదమ్ము లని గాని బంధుసంబంధము లెవ్వియు నుండఁ గూడదు. కనుక నామెను దహన మొనర్చి మా కవమానముఁ గల్గింపకుము. మేమే యామెం గాల్చివేయుదు" మని పలికిరి.

అంత శంకరుఁడు "వలదు. వలదు. నేనే నా చేతులార నామెను దహన మొనర్తు నని యొకప్పు డామెకు వాగ్దాన మొనర్చితిని. ఆడినమాటఁ దప్పరాదు సుమా! అదియునుం గాక యామె మరణించునపుడు గూడఁ న న్నదియే వాంఛించినది.

తల్లి యాజ్ఞయే భగవదాజ్ఞ. ఎన్ని నోము లెన్ని వ్రతము లెన్ని ధర్మము లాచరించినను తల్లినిఁ త్యజింపవచ్చునా? 'మాతృ దేవో భవ' యనునది మీ రెఱుంగనిదా! యని శంకరుఁడు ప్రత్యుత్తర మొసఁగెను.

"ఓ మాయావీ! చాలు. చాలు. మాటాడకుము. నీ యిష్టమువచ్చిన ట్లొనర్చుకొనుము. శవసంస్కారాది కార్యము లకు మేము దోడ్పడఁజాల" మనుచు వారు వెడలిపోయిరి.

ఆ బెదరింపులు శంకరునియెడ వృధకాగా, ఆయన తనతల్లి సంస్కార కార్యనిర్వాహణమునకుఁ గడంగెను. కాని శవమును దా నొక్కఁడె కాటికిఁ గొంపోవజాలనందునఁ దానిం దునియ లొనర్చి యొకటొకటిగఁ గొంపోవ సంకల్పించెను. కాని చాల దవ్వునంగల మసనభూమి కా తునియలుఁగూడ మోసికొని పోఁజాలకఁబోయెను. అందువలనఁ దన యింటి పెరటియందే దానిని సంస్కరింపఁ దలఁచెను. తానే కట్టెల నేర్చి తెచ్చి పెరటియందు చితిం బేర్చెను. శవమును నాల్గు ఖండములుగ ఛేదించెను. ఒక్కొక్క భాగమునే గొంపోయి కాష్ఠమున నిడి దహనము జేసెను. అది యంతయు గాంచి యూరి వారెల్లరు దిగ్భ్రమజెంద ఒకఁడాయనకడకరగి "తల్లినే తుత్తు నియలుగ ఖండించితివా?" యని యడగిరి. అప్పలుకులకు శంకరుఁడు "ఓ యవ్యక్తులారా! ప్రాణముపోయిన వెనుకఁ కళేబరముఁ గాల్చుటెట్లో ముక్కలుజేయుటయు నంతియే! ఎండిన పూగొమ్మల వంటచెఱకుగ నుపయోగించుకొనుట లేదా!" అని నుడివెను.

శంకరుఁ డంత విధ్యుక్తముగఁ గర్మలం దీర్చి శృంగేరికి వెడలిపోయి తన పర్యటనములను మరల ప్రారంభించెను. కొన్ని యేండ్లుఁ గడచెను. తన సమకాలికు లందఱికంటెను శంకరుఁడే మేటి యాచార్యుఁడాయెను. అక్కాల మందలి భూనాథు లెల్లరు శంకరు నాహ్వానించి సత్కరించుటలోఁ బోటీలు పడసాగిరి. అత్తఱిఁ గేరళదేశాధీశ్వరుఁడు గూడ శంకరుని మాహాత్మ్యము విని యాహ్వానించెను. నంబూద్రుల నెల్ల రావించెను. వారి సమ్మతినిఁగొని శంకరుఁడే వారి కంద ఱకును మార్గదర్శకుఁ డని యొడఁబఱచెను. వారి యిండ్ల యందు నాఁటినుండియు మరణించిన వారినెల్లఁ దునియలుగఁ జేసి వారివారి యిండ్ల వెనుక దొడ్డియందే దహన మొనర్చి, శంకరు ననుకరించుట గౌరవనీయమగు నాచారమై యేర్ప డెను. ఇప్పటికి వేల సంవత్సరములు గడచినను నేటికి నా యాచారమే యచట స్థిరముగ నిలిచియున్నది.

## 13. దుర్మార్గుని దుర్మార్గమే హత మొనర్చును

శంకరాచార్యులు తన విఖ్యాత వ్యాఖ్యానముల నెల్ల బూర్తి యొనర్చి యద్వైత సిద్ధాంతములఁ బ్రచురించి, తన జీవితోద్దేశములు సాఫల్య మయినటుల భావించెను. మూల వ్యాధిచే మిక్కుటముగ బాధపడుచు శరన్నవరాత్రములయం దొకనాఁ డాయన దక్కనునందలి యొక గ్రామమున విడిసి యుండెను. శ్రీసూక్త పురుషసూక్తముల నొకనాడు భక్తిమై పఠించుకొనుచుఁ పారవశ్యమునఁ దన్మయత్వముం బొందెను.

అట్టి పారవశ్యములోనుండి శంకరుఁడు తన శక్తికి మించనిదాని దేనినైనను ఎవరికైనను నొసఁగుదు నని బాహాటముగఁ బ్రకటించెను.

ఆ నాటి మధ్యాహ్న సమయమున నా ప్రాంతమున నటునిటుఁ బచారు చేయుచుండ నొక కాపాలికుఁ డరుదెంచి శంకరు నిట్లడిగెను : "నీవు బ్రాహ్మణోత్తముఁడవు, నీ శిరమును కాళికాదేవికి బలిగా నొసగినచో నీ భూలోకమున నా వాంఛితము లెల్ల నాయమ యనుగ్రహింపఁగలదు. నాకు రక్తసిక్తమగు నీ శిరముఁ గావలయును. ఇమ్ము."

శం :- బలి రాక్షసకృత్యము. శాస్త్ర నిషిద్ధము.

కా :- అది నీ యభిప్రాయము. బలి నొసగుట నాకు సమ్మతమే. నీవంటి మహాపురుషుని బలియొనర్చుటచే నా జీవితాశయము లెల్లను ఫలించు నని నా నమ్మిక.

శం :- మానవ జన్మము దుర్లభము. అట్టియెడ స్వలాభాపేక్షాపరులై, యిట్టి పైశాచికకృత్యములనొనర్ప సమకట్టు నిర్దీవహృదయులుగూడ భూమిపై నుందురా? కావున కాపాలికా, నీ యనుచితాశయముల నుండి మనసు మరల్పుము.

కా :- స్వయంకృషియే సేవానిర్మాలమునకు శరణ్యమను విషయమును మీరే వాక్రుచ్చితిరిగదా. నా శృంఖలావిచ్ఛేదమునకు నేనే యత్నింపవలయును. అందరాని సుఖములకై నే నఱ్ఱులజాచుటలేదు. మోక్షసాధనకు భక్తియే యుత్తమోత్తమమైనదని మీరే పలుమారు నుడువలేదా? కాళికాదేవియెడ నా యకుంఠితభక్తియే ఈ బలికి గార

ణాము, దీనివలన మీా క్షేమమాత్రము నష్ట ముండదు. మీా జీవితాశయముల నెల్ల పరిపూర్తి యొనర్చుకొంటిరి. మీా రా పరమాత్ముని సాయుజ్యముం బొందుట తథ్యము. మీా దివ్యసుఖములను మీారే యవలీలగ సాధించుకొంటిరి. జననమరణబంధములనుండి విముక్తిం బొందితిరి. కావున నింకను నీమూలవ్యాధితో బాధపడుటయేల ? అహంకార మమకారముల నిర్జించితి ననియు, నవినాశి ననియు, మీారే చెప్పితిరిగదా! 'ఆత్మ నిత్యము, చావుపుట్టుకలు గాని, వృద్ధిక్షయములుగాని లేవు. నేను చావునకు భయపడను. కులగౌరవములనుం బాటింపను. నేనే బ్రహ్మానందమును, బంధరహిత నిర్మలానందాత్మజ్ఞాని ' నని యెన్నియో మారులు మీారు చెప్పితిరిగదా! అట్టిచో నా కోర్కె నంగీకరింప మీారేల ముందువెనుక లాలోచించెదరు ? మీా శక్తికిమించని దేదియైననుం దప్పక నేరికైన నొసంగెద నని మీారాడినమాట తప్పుదురా ? ఈ నా కోర్కె మీా శక్తి కతీతమైనది కాదుగదా ! వైదికమతౌన్నత్యమునకు మీా వాక్కే మహామంత్రముగ నుచ్చరింపం బడుచున్నది. దుఃఖయుతమును, వాతపిత్తశ్లేష్మ శోణిత వారాశియు, దుర్గంధ మలమూత్రముల కొంపయు నగు నీ శరీరమే నిత్యమని భావించి యాడినమాట నెవ్వండునుం దప్ప యత్నింపండు.

శం :- ఓరీ దుష్టబుద్ధీ! నీ కనులకుం బసిరిక లాపాదించినవి. భ్రాంతిచే నిట్టి యకార్యముల వలన నీ కుత్తుక నీవే

ఖండించుకొనఁ గోరుచున్నావు. మాత యట్టి యకార్యముల కెన్నటికిని సమ్మతింపదు. తప్పక నిన్నామె శిక్షించును.

కా :- అది యంతయు నా మాతకే వదలుడు. నా కోర్కె నీడేర్పుఁడు. ఆమె నన్ను శిక్షించినను, రక్షించినను ఫలితము నేనే యనుభవింతును.

శం :- సరియే. నీ యిష్టము. ఆడిన మాటఁ దప్పను. సత్యముకంటెను ప్రియతమ మైనది నాకు వే ఱొండు లేదు. రాత్రికి రమ్ము. నేను సమాధిలో నుందును. నీ కోర్కె నీడేర్చుకొనుము.

అంత నాకాపాలికుఁడు ప్రహృష్టాంతరంగుఁడై శంకరునకు ధన్యవాదము లర్పించి వెడలిపోయెను. శంకరుఁడు, " జననీ! నన్ను మించిన పాపి లేడు. నిన్ను మించిన యఘౌఘ నివర్తిని వేరు లేదు. నీ కుచితవిధమున నొనర్చుము. " అని ప్రార్థించెను.

ఆనాఁటి రేయి శంకరుఁ డెప్పటివలెఁ గాక శిష్యుల నందఱ ననిపి, తానే యొంటరిగఁ దన గదియందుఁ గూర్చొని తలుపులు తెరచివైచి సమాధియం దాసీనుఁడాయెను. ఆయసాధారణ కృత్యమునకు శిష్యుల కెల్ల ననుమానము వొడమెను. ప్రథమ శిష్యుఁడు పద్మపాదుఁ డేమి జరుగునో గమనింప నెంచి, యొక దెసఁ బొంచియుండెను. ఏ దేవుఁడో శంకరునకు సాక్షాత్కరించు ననియుఁ, దాను నందే యుండినచోఁ

దనకును భగవద్దర్శనభాగ్య మబ్బు ననియు, బద్మపాదుఁడు దృఢముగ నమ్మియుండెను. నిశీధిసమయమునఁ గాపాలికుఁడు విచ్చుకత్తి నెత్తి శంకరుని దెస కరుదెంచుటఁ గాంచి వెఱగు పడెను; నిశ్చేష్టుఁడై యేమి జరుగునో యని రెప్పవాల్పక చూచుచుండెను. తలుపులు బాహాటముగఁ దెరచియుండు టయు, శంకరుఁడు సమాధిలో నొంటరిగ నుండుటయుఁ గాపాలికుఁడు గాంచి తన యీప్సితము నెరవేరఁగలదు గదా యని సంతుష్టుఁడయ్యెను. శంకరుని శిరమును ఖండించి కాళిక నివేదన మొనర్చు తలంపునఁ దళతళ మెఱయు కరవాలమునుఁ గరమునంబట్టి యా యాచార్యపుంగవుని చెంత కరిగెను. కత్తి నెత్తెను. వెంటనే హస్తిపై లంఘించు సింగపుఁ గొదమ పగిది పద్మపాదుఁడు కాపాలికునిపైఁ బడి యా ఖడ్గమును లాగుకొని యా కరవాలము తోడనే వాని కుత్తుకను ఖండించి యమసదనమున కనిపెను. పద్మపాదుని యఱపులు, కాపాలి కుని రోదనములు విని దక్కినశిష్యులెల్ల రచ్చోటికిఁ బరుగిడిరి. శంకరుఁడు మాత్రము తన్మయుఁడై సమాధియం దుండెను. తదనంతర మెంతసేపటికో శంకరుఁడు మేల్కాంచి చచ్చిపడి యున్న కాపాలికుని కళేబరమునుఁ గాంచెను. పద్మపాదాది శిష్యబృందము వలన యావద్వృత్తాంతము నాలకించెను. “దేవి కుపితయై యీ దురాత్ముని శిక్షించెను. అంబ యిట్టి దుష్కృత్యముల యెడఁ దన విముఖత నిర్వ్యాధముగఁ గనఁ బఱచెను. దుర్మార్గుని యాతని దుర్మార్గమే హాత మొనర్చెను. ధర్మమును నాశన మొనర్చువాఁడు దానిచేతనే నశించును.

కాపాలికుని కాతని యధర్మ ప్రవృత్తియే వినాశ కారణ మాయెను. దీనివలన నధర్మము దేవి కంగీకృతము కా దనునది విదితమాయెను” అని శంకరుఁడు పల్కెను.

## 14. మిథ్య

విష్ణువర్ధనుఁడు వైష్ణవుఁడు. హోయిసాల రాజ్యాధీశుఁడు. ఈ లోకమందు సర్వమును మాయయే యను శంకరుని సిద్ధాంతము లాతనికిఁ గోపకారణములాయెను. ఆ రాజు ‘అమిథ్యావాది’ శంకరుని కొక పాఠమును బోధింప నెంచి అప్పటి శృంగేరి మఠాధిపుఁడగు శంకరాచార్యులఁ దన నగరమునఁ కాహ్వానించెను. ఆ పరమపురుషుఁడు విశ్వమంతయు మిథ్యయే యను తన వాదమును సమర్థించుకొనఁగల్గెను. రాజంతకు మునుపే శంకరునిపై వదలుట కొక మదగజము నాయత్త పరచియుంచెను. మదకరి యాయనపై కురుకుచుండఁగనే శంకరుడు తప్పించుకొని తన్నుఁ దా రక్షించుకొనుట కొఱకందుండి పరుఁగిడెను. అంత నారాజు, “పూజనీయా! ఈ యేనుఁగుఁగూడ మిథ్యయేయని యెఱిఁగియు నేల కాలికి బుద్ధిచెప్పుచున్నా” రని యడిగి వికవిక నవ్వుచు గేలసేయసాగెను. శంకరాచార్యులు “ఓ రాజా! నాపరుఁగుగూడ మాయయే. ఈ ప్రపంచ మందంతయు మాయయే. ఇది మాయాలోకము” అని నుడువుచుఁ బరువెత్తి పోయెను.

## 15. మానస పూజ

అదియొక వార వనితాగృహము. రేయనక, పవలనక; వారమనక, వర్జ్యమనక; నిరంతరము నాయింటికి వచ్చుచుం బోవు

చుండు విటగాండ్ర సంఖ్య నెన్న నా చిత్రగుప్తునకుఁ గూడ మిన్న యగునేమో! ఆ యింటిపంచ నొక సన్న్యాసి భగవ ద్ధ్యానమున కారంభించెను. నిశ్చలతకు భంగము వాటిల్లఁ బట్టరాని కోపమున "నీమె యెంత సిగ్గుమాలినది! ఎంతటి చండాలి!" యనుచు నాతఁడు విసుగు కొనును కాని యా పంచను వదలి పోనొల్లక యందే యుండి నిత్యమును ధ్యానముఁ జేయుచుండెను. క్రమముగ నా యపవిత్ర గృహము లోని కరుదెంచు విటకాండ్ర సంఖ్య లెక్కించుటయే యాయ నకు నిత్యకృత్యమయ్యెను. నోట 'రామ రామ' యనుశబ్దము లుచ్చరించుచుండునే గాని, మనసుమాత్ర మా వెలయాలి దుష్కృత్యములపైననే లగ్న మగుచుండెను.

ఆ వారకాంత మాత్ర మట్లుగాక నిరంతరము, "నే నెంత పాపిని. తలవాకిట దివ్యపురుషుని భగవధ్యానము, ఇంటి లోపల లజ్జావిహీనమై యనుక్షణమును పడుపుఁగాసుల కాసించి, జారత్వమున మునింకించు యీ నా పాడుశరీరము. ఇట్లెంత కాలము గడుపవలయునో కదా?" యని యామె లోలోనఁ గుందుచుఁ బశ్చాత్తాపపడుచుండెను. మేనుమాత్ర మా యవినీతికి బాల్పడుచుండినను, మనము:మాత్ర మా పర మాత్మునిఁ గూర్చియే చింతించుచుండెడిది.

కొన్నిదినముల కా కులటయు, విరాగియు నిరువురును మరణించిరి. తా మనుకొనిన దానికి విరుద్ధముగ నా విరాగి నరకమునకును, నాజారిణి స్వర్గమునకును నేగిరి. అది గని యా సన్న్యాసి వెంటనే భగవంతుని కడకేగి, తన పతనమునకుఁ

గారణ మెఱింగింపఁగోరెను. అంత నా పరంధాముఁ డిట్లనియె: "ఓయీ! నీ శరీరము మాత్రమే నన్నుఁబూజించు చుండెడిది. ధ్యాన మా జారిణి విటకాండ్ర లెక్కించుటలో లగ్నమై యుండెను. ఆమె కట్లుగాక శరీరము పాపకృత్యములపాలై యుండినను, డెందము మాత్రము నిరతము నా చింతయందే లగ్నమై యుండెడిది. అందువలన నామెకు స్వర్గము, నీకు నరకము ప్రాప్తించినవి." అన మారుమాటాడక యా ముని వెడలిపోయి యుచిత శిక్ష ననుభవించెను.

## 16. విత్తమే మృత్యువు

వా రిరువురు పాంథులు. చిరకాల మిత్రులు. కాయములు మాత్రము వేరు. కాని మనసు లొకటియే. అది యొక నిర్జనపు టడవి. ఏదో ఉబుసులాడుకొనుచు, నేదో పనిపై నేదో గ్రామమున కరుగుచుండిరి. హఠాత్తుగ నొక మనుజుఁ డొక పొదచాటుననుండి భీత హృదయుఁడై పరుగెత్తుకొని పోవు చుండెను. వానిం గాంచి వారు భయహేతు వేమని ప్రశ్నించిరి. "అదిగో! ఆ పొదచాటున నే నొక మృత్యుమూర్తినిఁ జూచితిని" అని యాతఁడు కడు వెఱఁగున తడఁబడుచుఁ బలికెను. అప్పలుకులకు వారిరువురునుఁ గూడ భయపడి, "అందేమైన పులి గలదా?" యని ప్రశ్నించిరి. "కాదు కాదు. అది వ్యాఘ్రమున కంటెను కడు దుష్టము. కందమూలముల పెకలించుచుంటిని. తటాలున నది యగపడినది. బయటకు లాగి దానినందే పారవైచితిని." అని యాతఁడు ప్రత్యు

_త్తర మొసఁగెను. "అది యేమి? అదియేమి?" యని కడు నాతురమున నిరువురునుఁ బ్రశ్నింప "స్వర్ణ రాశి" యని యా తత్త్వజ్ఞాని మారు పల్కెను. "ఎందుఁగల దెందుఁగల" దని యేకకంఠమున వారడుగ, "అదిగో! ఆ పొదచాటున" అని యాతఁడు దెలియఁబరచి తనదారినిఁ బోయెను. అంతన య్యిరువురు నచ్చోటికిఁ బరుగిడి యా పెన్నిధిం గాంచి యమందానందకందళిత హృదయులైరి. "ఈ వేదాంతు లెంత మతిహీనులు. ప్రాణదాతయగు కనకమును మృత్యుమూర్తి యనుచున్నారు" అని యొకరితో నొకరనుకొనిరి. అంత నొకఁడు, "కర్తవ్యము నాలోచింపుము. పగటివేళ దీని నూరిలోనికిం గొంపోవుట శ్రేయముగాదు. అందఱకును వెల్లడి యగును. అపుడు మన కేమియు దక్కదు. ఎవరికిని గానఁబడకుండ రాత్రిపూట దీనిం గొంపోవుదము. అంతవఱకు నొకర మిందే యుండి మఱియొకర మూరిలోని కరగి యాహారముఁ గొనిరావలయు నని యనుచుండగనే రెండవవాఁడును "మంచిదే" యని యొప్పుకొనెను. ఒకఁ డందే కావలియుండెను. రెండవవాఁ డూరిలోని కరిగి యన్నము తేఁబోయెను. వాఁడటు లరుగుచుండగనే కావలి యున్నవాఁడిట్లు తలపోసికొనెను: "నేనొక్కఁడ నేమైయుండిన నెంత బాగుండెడిది! ఇప్పుడు వీని కర్ధభాగమునుఁ బంచి యియ్యవలసియున్నది. ఇదియునుఁ గడు స్వల్పముగ నున్నది. నాకా పెద్దకుటుంబము గలదు. ఇదియంతయు నాకే సంక్రమించినచోఁదప్ప, యిం దర్థమనినచో నిరర్థక మే యగును. కావున

నొకయుక్తిఁ బన్నెదను. వాఁ డిచటికి కరుదెంచుచుండగనే వేరుమాటలేక యున్నటులుండి వానిపైఁబడి యీ ఛురికతో గడతేర్చెద. ఇదియంతయు నాకే దక్కును. ఇది నిర్జనప్రదేశ మగుటచే నెవ్వరికి నీ విషయము దెలియదు.” అనుకొనుచు నా ఛురకత్తిని బదునుఁజేసికొని సిద్ధముగ నుంచుకొనెను.

ఇది యిట్లుండ రెండవవాఁ డింటికేగుచు నిట్లాలోచించెను: “ఆ కొద్దివిత్తమున వానికి సగ మియ్యవలయును. నాకే ముండును? నా కప్పు లధికము. నా కడ ధన మున్న విష యము నప్పుల వా రెఱిఁగినచో జలగలవలెఁ జుట్టుకొందురు. పీల్చి పిప్పిజేయుదురు. నా కప్పుడు సున్నకు సున్న హాళ్ళికి హాళ్ళియుఁ దప్ప మ ఱేమియు మిగులదు. వార్ధక్యమున కేమి దాఁచుకొనగలను? వానికా యెట్టి ఋణములును లేవు. బంధువులెల్లరును భాగ్యవంతులు. వాని కా యర్థముగూడ మిగిలిపోవును. కావున నొక యుక్తిపన్నెద. నేను భుజించి వానికిఁ గొంపోవుదానిలోఁ గొంచెము విషము గలిపినచో నా పంట పండును; నా కోరిక లీడేరును. దానిఁ గనుఁగొనునంతటి మేధావు లెవరుందురు? ఆ హేమంబంతయు ననాయాసముగ నాకులభించును. హాయిగ జీవితశేషమునుఁ గడుపవచ్చును.”

అని తీర్మానించుకొని యింటికరిగి కడుపునిండ మెక్కి తన బాల్యమిత్రునకు విషాన్నముం గొంపోయెను. ఆ స్థలమునుఁ జేరుచుండగనే కావలియున్న చిన్ననాఁటి చెలికాఁడు హఠాత్తుగ హరిణంబు పైఁబడు హర్యక్షుంబుమాడ్కి వానిపైఁబడి ఛురికచే నాతని యమసదనమున కనిపెను. ‘ఎంతటి మిత్రుల

4

కైన విత్తము మృత్యుహేతువుగదా !' యని యనుకొనుచు నాఁకటిబాధకుఁ దాళలేక తనకై కొనిరాబడిన యన్నము నెట్టి సంశయమునుఁ జెందక కడుపార భుజించెను. ఏమి చెప్ప వలయును. పావుగంటలోననే వాఁడును 'విత్తమే మృత్యు' వను యా వేదాంతిపుంగవుని వచనము లెంత సత్యములనుచు చిన్నతనమునుండి క్షణమైన నెడబాసి యెరుంగని తన చెలి కాని గలసికొనెను.

## 17. అమాయకుఁడు

గోవిందుఁడు కుగ్రామవాసి. అమాయకుఁడు. అరణ్యముల గూర్చియు, నడవి జంతువులఁ గూర్చియు నేమాత్ర మెరుఁగని మడియఁడు. ఒకనాటిమధ్యాహ్నమున హాయిగ భుజించి చెంత గల వేఱొక గ్రామమున కేదో కార్యార్థమై బోవుచుండెను. అది యటవీమార్గము. కొంతద వ్వేగిన పిదప నొక పెద్ద వృక్షముమగుఁగున నిలువఁబడి దాని పంగలు కొమ్మలనుండి చేయిఁజాచి యొక పులితోకను గట్టిగఁ బట్టికొనియున్న మను జునిం గాంచెను. ఆశార్దూలము తప్పించుకొని పోవుటకై విశ్వ ప్రయత్నములు జేయుచుండెను. కాని వాఁడు మాత్రము తన భల్లూకపుపట్టు సడలింపక గట్టిగ బట్టుకొనియే యుండెను. చెట్టు అడ్డమైనందున వానిం గరచుట కా వ్యాఘ్రమునకు వలను పడకుండెను. వాఁడును నేమిచేయుటకును దోచక తహతహ పడుచు, పట్టువిడిచిన నది జంపునేమో యని గుందుచుండెను. పుంతవెంబడి బోవుచున్న గోవిందునిం గాంచి, గోవిందుఁడే

తన్ను రక్షింప ప్రత్యక్షమైనట్లు సంతసించెను. బిగ్గరగ 'సోదరా!' యని చేరఁబిలిచి 'దీని బట్టుకొని వచ్చుచుండగా నీ పాడుమృగము పలుపుఁద్రెంచుకొని యిటు పరువెత్తినది. అదిగో! ఆ చెట్టునొద్దకుఁ బోయి పలుపును దెచ్చెద. అంత వఱకును గొంచెము దీని తోకను గట్టిగ బట్టుకొనియుండుము. నీ మేలు మరువను' అని బ్రతిమాలెను. 'సరియే. ఎంతకాల మటులు పట్టుకొని యుండుమనెదవు' అని గోవిందుఁ డడుగ "పదినిమిషములపాటు మాత్రమే-సుమారు ఫర్లాంగుదూర ముననే-అదిగో! ఆ కనబడుచోటనే - దీని త్రాడు దూసి పోయినది. అచటికేగి చిటికలో గొనివత్తును. అంతవఱకును గొంచె మోపికపట్టి పట్టుకొనియుండుము." అని బేలుపుచ్చెను. పాప మామూఢుఁడు వల్లెయని దాని తోకను గట్టిగబట్టుకొని "పొమ్ము. వేగముగ నా త్రాటిని గొనిరమ్ము. అంతవఱకును దీని వాలమును బట్టుకొనియుండుము" అనుచు నా ధూర్తుని బంపివేసెను. బ్రతుకు జీవుడా యనుచు పులివాత బడకుండఁ దప్పుకొంటినిగదా యని యత్యంతానందమున మెల్ల మెల్లగఁ గనుచూపు మేరదూర మరిగి యొక చెట్టునెక్కి 'యాయుగ స్వభ్రాత రాకుండిన నాపని నేటితోఁ దీరిపోయియుండెడిదిగదా!' అని యనుకొనుచు హాయిగ గూర్చొని యేమి జరుగునో యని గమనించుచుండెను.

పదినిముసముల వఱకు గోవిందుఁడు దాని వాలమును బట్టుకొని యమ్మనుజునికొఱ కెదురుజూచుచుండెను. కాని యెంతసేపటికిని వాఁడు రాడయ్యె. అప్పుండరీకముతో బెనగు

టచే నిమిష నిమిషమునకు శ్రమ యధికమగుచుండెను. శక్తి సన్నగిలుచుండెను. పెక్కుపర్యాయములు "అయ్యా, రమ్ము! వేగముగ రమ్ము! రాకున్న నీజంతువును వదలివేయుదును" అని గొంతెత్తి యఱవసాగెను. పాప మయ్యరణ్యా రోదనము నాలించువారెవ్వరు? ఎంతకును బ్రత్యుత్తరము లేకుండుటచే, 'వాని జంతువు పారిపోవు నేమో యను దిగులు వానికే లేనప్పుడు నేనేల వానికొఱ కింత బాధపడవలయును. దీనిని వదలి వేసెద. ఉపేక్షాఫలిత మనుభవించును" అని తలచి బిట్టలుకచే దాని తోకను జారవిడిచెను. ఎంతకాలమునుండియో బాధపడుచుండిన యప్పుండరీకము పట్టరాని కోపమున వానిపైబడి చీల్చి చంపెను.

## 18. మత పరీక్ష

అతఁడు దక్షిణదేశస్థుఁడు, శైవబ్రాహ్మణుఁడు, పట్టణవాసి. క్రైస్తవమత వ్యామోహితుఁడై మతము మార్చుకొనెను. ముప్పది సంవత్సరముల కాల మా మత సిద్ధాంతములను గడు భక్తిఁ బఠించెను. అభ్యసించెను. అందె వేసిన చేయి యాయెను. ఏబదియవయేట నొకనాఁడు నవ్యమత సిద్ధాంతములు తన హృదయమునఁ జక్కఁగ హత్తుకొనిపోయిన వనియుఁ బూర్వమత సంప్రదాయములు మచ్చునకైనఁ దనయందు లేవనియు, నటులున్నటులఁ జూపింపఁగల్గువారెవరైనఁ గలరా యనియు బడాయిలు గొట్టసాగెను. మానసిక శాస్త్రవేత్త యగు యువకుఁ డొకఁ డాసవాలును గమనించి, బాధాకర మగు పరీక్షకు సమ్మతించినచోఁ, దాను బూర్తిగ

విస్మరించితి నను పూర్వమత జ్ఞానమును బయటికిఁ దేఁగల నని యెను. ఆ క్రైస్తవమతావలంబకుఁ డెంత కఠిన పరీక్ష కైనఁ దాను తాళఁగల్గుదు నని వచించి యందుల కియ్యకొనెను. పరీక్షా సమయ మాసన్నమాయెను. పదినిమిషముల కాలము కన్నుల మూసికొని నిలువఁబడవలయు నని యా యువకుఁ డాజ్ఞాపించెను. ఒక యినుప కమ్మిని యెఱ్ఱగ గాల్చి యున్నటులుండి వాని కుడిపాదములపై బాఁగుగ వాత వేసెను. వెంటనే యా మతాంతరప్రవిష్టుఁ డా బాధచే మైమఱచి బిగ్గరగా "శివ శివా! శివ శివా!" యనుచు నార్చెను.

అంత నయ్యువకుఁడు విజయోత్సాహమున, "అయ్యా! ఏమిది? మీ బాల్యమున మనశ్శఫలకమున నాటుకొనిన నమ్మకములే యీ నాటి పరివర్తనచేఁ గల్గిన విశ్వాసముల కతీతమైనవే? మీ కష్టసమయమున "శివ శివా!" యని యంటిరే గాని 'క్రీస్తు క్రీస్తు' అని యనక పోతిరి గదా!" యని నుడివి బుద్ధిచెప్పెను.

## 19. గోపాలుని మహిమ

జానకి వితంతువు, దుర్భర దారిద్రపీడిత. ఏడేండ్లసుతుఁడు దప్ప 'నా' యను వేఱు దిక్కులేని యసహాయ. కాని సుగుణ ఖని, సుశీల, సుచరిత. ఆవాస మొక కుగ్రామము. చుట్టును చిట్టడవి, అడవి కావలివైపున పల్లెయందు విద్యాగరపు నొక గురువర్యుడుండెను. రాముని కాతనికడఁ జక్కనివిద్యాబుద్ధుల గఱప జానకి వాంఛించుచుండెను. ఒకనాఁ డబ్బాలున కవ్వి

షయ మెఱిఁగింప వాఁడుజడిసి "అమ్మా! ఒంటరిగ నేనయ్యడవి దాటిపోవు టెట్లు? నిత్యమును నీవు తోడువత్తువా?" యని యడిగెను. "లేదు తండ్రీ! అనుదినము నీ వెంటనే వచ్చుచుండినచో మన యింటియొద్ద నెవరుందురు? మనపొట్టజరుగు టెట్లు? ఆర్జించిపెట్టువా రెవరైనగలరా? అయ్యడవిలో నీ చిన్నన్న గలఁడు. నీకు భయముఁ దోచినపుడెల్ల 'చిన్నన్నా! చిన్నన్నా!' యని బిలువుము. ఆతఁడు నీకు దోఁడువచ్చి యడవి దాటించును." అని యామె నుడివెను.

"అమ్మా! అటులైనచో నాతఁ డెల్లప్పు డేల యావనము లోనే నివసించుచుండును? మనయింటికి రాఁడేల?" యని య య్యర్భకుఁ డడిగెను.

"వనవాసమే యాతని యభీష్టము. నీ వాతని నేమియు నడుగకుము. అట్లడిగినచో నతఁడు మరల నీకుఁ దోడు రాఁడు." అని యామె బోధించెను.

"లేదమ్మా! అటుల అడుగనులెమ్ము. ఒంటరిగఁ బోవల యునే యను భయము పోయినది. నేఁటినుండియే పల్లెకూటము న కరిగెదను." అని యానాఁడే పాఠశాలకుఁ బయలు దేరెను.

కడు సాహసముతోడ నాబాలుఁ డడవిం బ్రవేశించెను. కాని ముందడుగు వేయుటకు ధైర్యము చాలదయ్యె. అందుచే వెంటనే "చిన్నన్నా! చిన్నన్నా!" యని గట్టిగ నఱచెను. అంతలో పదునారేండ్ల బాలుఁడు, చేత నొక పిల్లనగ్రోవితో

నెచ్చటినుండియో పరుగుపరుగున వాని చెంత కరుదెంచి "నీ కేమిగావలయు" నని యడిగెను. "ఇయ్యరణ్యమున కావలివైపునం గల పాఠశాలకే నేగవలయును. తోడుగ నీవు నా వెంట రాఁ గోరెదను. అని రాముఁ డడుగుచుండఁ గనే 'వల్లె' యని వేణుగాన మొనర్చు నా బాలుఁడు రాముని నడవిదాటించి వెడలిపోయెను. బాలుఁడు సుఖముగ బడికిఁ బోయెను. అధ్యాపకుఁ డాతనిఁ గడుఁ బ్రీతిమెయి తనశిష్యునిగఁ జేస్కొన నంగీకరించి. "అబ్బాయీ! నీవు చిరుతపాపఁడవు, అడవిదారి నొంటిమై యెట్లు రాగల్గితివి?" అని యడిగెను. "చిన్నన్న నా వెంట వచ్చె"నని యనగనే "యతఁడేమి సేయుచుండు?" నని గురు వడిగెను. "అరణ్యముననే, వసించి పశువుల మేపుకొనుచుండు" నని యా బాలుఁడు ప్రత్యుత్తర మొసఁగెను.

ఆ నాఁటినుండియుఁ గ్రమముగ రాముఁడు పాఠశాల కేగుచుండెను. వచ్చుచుం బోవుచుండునపుడు నిత్యమును రామునకుఁ జిన్నన్న తోడగుచుండెను. కొన్ని దినములుఁ గడచెను. గురుపుత్రికా వివాహము నిశ్చయింపఁబడినటుల నొకనాఁడు శిష్యులకెల్లఁ దెలుపఁబడెను. ప్రతివిద్యార్థియు యథోచితముగ గురువుగారికిఁ గానుకలర్పింపఁ దీర్మానించిరి. రాముఁడును యథాశక్తిగ నేదైన సమర్పింపఁగోరెను. సాయంకాలమున నింటికేగి, తల్లిని "అమ్మా! రేపు మా గురువుగారి పుత్రికా వివాహ మహోత్సవదినము. నా సహపాఠులెల్లరు వారి వారి శక్తికిఁదగిన ట్లేదో యొక బహుమతి నిత్తురఁట. నాకు నేదైన

నిమ్మ. చంద్రునకు నూలుపో గనునట్లు నేను నేదైన నొసంగి నా కృతజ్ఞతం జూపుకొందును” అని యడిగెను. అప్పలునకు లకు జానకి “తండ్రీ! మనమే నిప్పచ్చరమునం దొప్పందోగు చున్నారమే! పూటగడచుట యేదు గడచిన ట్లున్నదే! మన మేమియ్యగలము? చిన్నన్న నే యేదైన నిమ్మని యడుగుము” అని చెప్ప, ‘సరియె’ యని రాముఁడు మరునాఁడు వేకువాత లేచి పాఠశాలకుఁ బయనమాయెను. అరణ్యమున మామూలుగఁ జిన్నన్నను బిలచెను. అతఁడు వచ్చుచుండగనే తన దురవస్థ నాతని కెఱుకఁ బఱచి గురువుగారి కొసగుట కేదైన నిమ్మని యడిగెను. ‘చిన్నన్న’ వెంటనే యొక కొబ్బరిచిప్పనిండ బాల నొసంగెను. రాముఁ డపరిమితానందమున దానిం బుచ్చుకొని చిన్నన్నకు ధన్యవాదము లర్పించి, కుడిచేత నా చిప్పనుఁ బట్టుకొని యెట్టి జంకుగొంకులు లేక నేరుగ పాఠశాల కేగెను.

అప్పటికే సుముహూర్త మాసన్న మయ్యెను. వధూవరులును, చుట్టపక్కములును, వివాహవేదిక కడ నాసీనులై యుండిరి. నూదిమోపను సందులేనటుల పెండ్లిపందిరియందు ప్రేక్షకులు కిటకిటలాడుచుండిరి. విద్యార్థిబృందమెల్ల వేదికకడఁ జేరి తమతమ బహుమతులనొసంగుచుండిరి. రాజపుత్రుఁ డొక్క డొక జత బంగరుదండలనొసంగెను. వైశ్యబాలుఁ డొకఁడొక యమూల్యమై యనుపమానమైన ముత్యాలహారము నావధువున కొసంగెను. మఱియొకఁ డొక బంగ్రెండు గుమ్మడిపండ్ల నిచ్చెను. ఇంకొకఁడు బదిబానల పెఱుగు నొసంగెను. ఇట్లే

ప్రతియొక శేదో యొక విలువగల వస్తువునే దెచ్చియిచ్చిరి. రాముఁడును వెనుకాడక ధారాళముగ సభికుఁ దాటుకొని పోయి గురువుగారి చెంత నిలువఁబడెను.

"అబ్బాయీ! అదియేమిటి ;" యని గురువర్యుఁ డడుగ "ఇది నా నూలుపో"గని యాబాలుఁడు తన కొబ్బరి చిప్పెడు పాలం జూపెను! అప్పూజనీయుం డదిగాంచి సస్మితాస్యుండై నిండుమనంబున 'నాయనా! తెమ్ము?' అని రెండుచేతులం బుచ్చుకొని సభికులం గాంచి 'వీనితల్లి నిజముపేదరాలు. శక్తికి దగిన ట్లొసఁగినది' అని నుడువుచు 'పోమ్ము. ఆ పాత్రలో పోయుము. ఉచ్ఛిష్టము లని రాముఁడు శబరియొసగిన ఫలములఁ గైకొన నిరాకరించెనా! మనఃప్రీతితో నొసఁగిన దెద్దియైనను దప్పకఁ బుచ్చుకొనవలసినదే! నిరాకరించుట మహాపాపము' అనియెను.

కాని దానిం బుచ్చుకొనిన సేవకుఁడు తులువ. ఆ బాలుని నవమానింపఁదలచి యాతుంటరి వికటముగ నవ్వుచు నా చిప్పెడు పాల నొక పెద్దగంగాళమున పదిమందియుఁ జూచుచుండఁ గుమ్మరించెను. వా రందఱును ముక్కుపై వ్రేలిడుకొనునటుల గంగాళమంతయు నిండి పొంగి పొరలి యా పెళ్ళిపందిరియంతయు పాలవెల్లు వయ్యెను. అంత గురుపుంగవుఁ డా బాలునిఁ జేరఁజేరి, "అబ్బాయీ! ఈ క్షీరమునీ కెవ రొసఁగిరి?" యని యడిగెను. "అడవిలో పిల్లనగ్రోవి నూదుకొనుచు గోవులఁ గాచుచుండు నాచిన్నన్న యొసఁగె"నని వాఁడు చెప్పెను.

"వాని పేరేమి ?" యని గురువుగా రడిగిరి.

నే నెఱుఁగను. అతఁడు మా యింటికెప్పుడును రాఁడు. నిరంతర మయ్యరణ్యమున నే నివసించుచుండును. వేణుగాన మొనర్చుచు నావుల మేపుకొనుచుండును" అని రాముఁడు జెప్పెను.

"అటులైన నాతఁడు నిజముగ గోపాలుఁడే"యని యాశ్చ ర్యమునఁ బలుకుచు "ఇన్ని సంవత్సరములుగ వేదాధ్యయన మొనర్చుచున్నాఁడను. ఆ పరాత్పరు నొక్క పర్యాయమైనను నేను దర్శింపలేక బోయితిని. ఈ పసిపాపడు ప్రతిదినమును నా పరమాత్ముని గాంచుచున్నాఁడు. ఎంతటిధన్యుఁడు! ఎంతటి ధన్యుఁడు!" అని యధ్యాపకుఁడు పలుకుచు "అబ్బాయీ! ఆ మహాపురుషుఁ డెక్కడున్నాఁడు ? నాకును జూపించి ధన్యునిఁ జేయుము" అని రాము నడిగెను.

"గురూజీ! అటులే. నా వెంట రండు," అని గురువుగారిని వెంటనిడుకొని రాముఁ డరణ్యమున కేగెను. తక్కిన వారెల్లరును—విద్యార్థులు, వధూవరులు, చుట్టపక్కములు, పురోహితులు, ప్రేక్షకులు—వీరువా రననేల, ఆ బాలగోపాల మాగోపాలపరమాత్ముని దర్శనార్థమై వారివెంట నరిగిరి. అరణ్యమునుఁ జేరగనే రాముఁడు యథాతథముగ "చిన్నన్నా! చిన్నన్నా!" యని బిలచెను. కాని యెవ్వరును రాకుండుటచే మఱల గొంతెత్తి, "చిన్నన్నా! చిన్నన్నా! నీ వెక్కడనున్నాఁ డవు? పిలుచునది నేనే. రాముఁడను" అని యఱచుచు

నేడువసాగెను. అప్పుడు దూరమునుండి యీ మాటలు విన వచ్చెను. "అనాథులును, ఆర్తులును, అసహాయులును నన్ను మనసార ప్రేమించి భక్తిమై స్మరించినంతనే ప్రత్యక్ష మగుదును. తెన్నుఁ దెలియక దుఃఖసాగరమునఁ దగుల్కొని బాధపడువాఁ డెవఁడైన నుండిన వానికి దప్పక దర్శన మొసఁగుదును. అంతియె గాని యీ సమూహమున కంతకును నగు పడునంతటి సులభుఁడను గాను. నేటివరకును నీవు నిరాడంబరివై, నేను నిజముగ నీ చిన్నన్ననే యని గట్టిగ విశ్వసించియుండినందున, నీకు మానవరూపమున నగుపడితిని. నీతోడ మాటలాడితిని. ఇఁకమీఁద నీ కగుపడఁజాలను."

## 20. అత్త త్యాగము

ముష్టివాఁడు బిచ్చమడిగెను. గృహ యజమానురాలగు నత్తగారింట లేకుండిరి. కోడ లింటియందేయుండెను. అత్తగారు లేరని భిక్షముఁబెట్ట నిరాకరించెను. దైన్యముతో నా బిచ్చగాఁడు వెడలిపోవుచుండెను. అప్పుడే యెచ్చటనుండియో యత్తగారరుదెంచుచుండిరి. ఆ భిక్షుకునిఁజూచి "మాయింటి నుండియేలవచ్చి వేయుచున్నాఁడ?"వనియడిగెను. "మీకోడలు బిచ్చముఁ బెట్టననిసందున వెళ్ళుచుంటి"నని వాఁడు నుడివెను. అప్పలుకులు వినినంతనే కన్నులు నిప్పులు రాల, "ఏమీ! నాయింట భిక్షము లేదని నుడువుట కది యెవ్వతె? అరచేతికిఁ బండ్లువచ్చినటు లున్నదే! నేనే యింటికిఁ బెద్దను. పెత్తనదారును. ఇది నాయిల్లు. నా వాకిలి. అది యెవతె? నిన్న

మొన్న వచ్చినది. ఇంక నొక్కబిడ్డతల్లియైనను గాలేదు. రమ్ము. నా వెంట రమ్ము పోవుదము. అట్టి యవకతవక మాటలు లెక్కింపకుము. ఉండిలేముల కధికారి యజమానురాలే' అని వానిని వెంటఁబెట్టుకొని పోయెను.

భిక్షుకుఁడామాటల కత్యంతానందభరితుఁడాయెను. ఆమె యేదో త్రవ్వి తలకెత్తునని నిజముగ నమ్మెను. 'అమ్మా! ధర్మదేవత లనిన మీరే. మీవంటి సదయహృదయ లుండ బట్టియే మా బోంట్లకుఁ బూట గడుచుచున్నది. 'అన్నస్య క్షుధితం పాత్రం' అన్నట్లు వేవిధములఁ గష్టించి సంసారము నెఱపు మీవంటిమహాతల్లులకేమాంబోంట్లకష్టముగపడునుగాని, కడుపులోఁజల్ల గదలక నీడపట్టున నిరతము గూర్చుండియుండు మీ కోడలివంటివారే మెఱుగుదురు?" అని స్తుతించుచు వాఁడామెను వెంబడించెను. అత్తగారింటిలోని కరిగిరి. కోడలిం బిలిచి "ముష్టివానికి బిచ్చముఁ బెట్టనని చెప్పినది సత్యమేనా?" యని గద్దించి యడిగెను. అత్తగారి యాగ్రహమునకుఁ గోడలి గుండెలు ఝల్లుమనెను. ఒడలు కంపించెను. నోటఁ దడియారెను. ముచ్చెమటలుఁ బోసెను. అత్తగారి కాబిచ్చగానిపైని యనుకంపమునకుఁ గారణ మెఱుఁగలేక నా యమాయకురాలు తా నొనర్చినది తప్పిదమే యనియు, దయయుంచి క్షమింపు మనియు వేడెను. "ఉండిలేములు నుడువ నే నుండ నీ వెంత మొనఁగత్తె వైతివే? నీ యత్తగారి యధికారము నాఁఱుమూఁడుఁ జేయ నెంచితివా?" యని మందలించుచు, ముష్టివానిం జూచి

లోపలికి రమ్మని పిలచెను. తన పంట పండినదని యుప్పొ ళ్లూరుచు వాఁడు లోనికరిగెను. అంత నాయ త్తగారు వానితో "ఓయీ! ఈ యింటి యజమానురాల నగు నేను, నీకు భిక్షము వేయ నని జెప్పుచున్నాను. ఇఁక పైన నింటిపెద్దలు జెప్పినఁ దప్ప దక్కినవారియొద్ద లే దనిపించుకొనకుము. వెళ్లుము" అని ధారాళముగఁ బల్కెను. పాప మా భైక్షు కుఁడు చిన్నవోయి తలవంచుకొని వెళ్ళెను.

## 21. రాజునకు నీతిపాఠము

కళింగమున నొకగొప్ప రాజేలుచుండెను. ఆతఁడెన్నియో లక్షల రూప్యములు వెచ్చించి జగన్నాథాలయమునుఁ గట్టిం చెను. ఆలయమునకుఁ దగిన విగ్రహము దొరకదయ్యె. అట్టి విగ్రహమునుఁ జెక్కియ్యఁగల శిల్పికై రాజ్యమునం దెల్లయెడలఁ జాటింపించెను. బహుమాన మొక లక్ష నాణ్యము లనెను. కాని తృప్తికరముగఁ బని నెరవేర్పనిచో మరణ శిక్ష తప్ప దనెను. ఆ గండకత్తెరలోఁ దగు లొక్కన నెవ్వఁడును సాహసించి చాలకాలము వఱకును ముందుకు రాఁడయ్యె. తుదకొక వృద్ధుఁ డాతేనిచెంతకరిగి యొక్కనిబంధ నకు రా జంగీకరించుచోఁ దా నాపనిని నెరవేర్తుననెను. రా జందుల కియ్యకొనెను. "ఎట్టి విషమ పరిస్థితులయం దైనను సరియే ముప్పదిరోజులవఱకు నా దేవాలయములోని కెవ్వఁడు నడుఁగిడరాదు. ఇది సుగ్రీవాజ్ఞసుమా! దీనికొడఁబడుచో నసలు జగన్నాథుని విగ్రహము నే తయారుచేసి యియ్యఁగలను."— అని యా వృద్ధశిల్పి యనుచుండగనే రాజు కడు సంతసమంది,

"ఇదియేనా నీ నియమము. ఎంతసులభ మైనది. తప్పక నట్లే తగినయేర్పాటుఁజేసెద. నీవు పనిప్రారంభింపుము." అని రాజు సమ్మతించెను. ఒక మాసమునకుఁ గావలసిన యాహారపదార్థముల నెల్ల నా శిల్పకారుఁ డాలయమున సిద్ధపఱచుకొని యాలయ కవాటములను బంధించెను.

ప్రారంభమునఁ గొన్ని దినముల వఱకు మేఘగర్జనములం బోలిన ధ్వను లనుదినమును దేవాలయమునుండి వినఁబడుచుండెను. తరువాత నశనిపాతముం బోలిన శబ్దములు బయటబడుచుండెను. పదిదినములు గడచెను. రాజుసభలోఁగూర్చొని "ఇట్టి శబ్దములకుఁ గారణమేమి? ఇంతకును వాఁడు చేయు విగ్రహ మొక్కటియేగదా? ఇంత బ్రహ్మాండమైన కోవెల నిర్మాణమున నిత్యము నైదువేలమంది పనిఁజేయుచుండియు నింతటి శబ్దము వినరాదయ్యె!" యని సభికుల నడిగెను.

"ప్రభూ! ఇది మిక్కిలి చిత్రముగ నేయున్నది. మమ్ము లోని కరిగి కారణ మరయు మనెదరా?" యని వా రడిగిరి.

"వలదు వలదు. ముప్పది దినములవఱ కెవ్వరికిని సందుఁ బ్రవేశ మియ్యనని వానికి మాట నొసఁగితిని. ఆడిన మాట తప్పదగునా? రోటఁ దల దూర్చి రోకటిపోటునకు వెఱవ నగునా? కానిమ్ము గమనింతము." అని యా భూవరుఁ డనియె.

దినములసంఖ్య యధికమగుకొలది యా భయంకర ధ్వానమును నన్నిమడుంగు లధికమగుచుండెను. లోన నేమి ముప్పా

వాటిల్లుచున్నదో యని రాజును దోదూాయ మాన మానసుఁడయ్యెను. ఇరువది రోజులు గడచెను. మఱల నాస్థానభృత్య సమావేశ మేర్పఱచి "ఈభయంకర శబ్దములకుఁ గారణ మేమైయుండనోపు ? నానాటి కధికమగుచున్న దే!" యని అడిగెను. "ఆ ముదుసలి రాతిస్తంభములనెల్లఁ బగులగొట్టుచుండనోపు" నని యొకసభ్యుఁడు వచించెను. "ఏమీ! ఆరాతసుఁడు ప్రాణతుల్యములగు నా కట్టడముల నాశ మొనర్చుచుండునా? అందునిమిత్తమే వాఁ డఱుదెంచెనా? త్రింశద్రాత్రములు గడచువఱకును లోని కెవ్వరిని రానియ్యనంటిని ? గత్యంతర మేమి ?" అని యా భూపతి తహతహలాడుచుండ నొక సభ్యుఁడు లేచి "మనము కోవెల బయటనుండియే వానిం బిలుతము, అందెట్టి హానియుం గలుగదు. ప్రళయకాలమేఘారావముంబోలు నీ ధ్వానంబునకుఁ గారణ మరయుదము" అని సూచించెను. "ఇది మంచి యాలోచనము. పోవుదము రం" డని రాజు వారిం బిల్చుకొని యాలయముకడ కేగెను. వా రందఱును దేవాలయ సింహద్వారముకడ గుమిఁగూడిరి. శిల్పిని గొంతెత్తి పిలచిరి. తలుపుల దట్టిరి. కాని ప్రత్యుత్తరము లేదాయెను. ధ్వనిమాత్రము మిగుల భయంకరముగ వినవచ్చుచుండెను. భేరీ మృదంగ పటహ ఢక్కారావంబులు సేయించెను. కాని లాభము లేదయ్యె. శబ్దముమాత్ర మధికముగనే యుండెను. లోన ప్రవేశింతమని యొక మంత్రి నుడివెను. కాని యాప్రభువుమాత్రము "వలదు వలదు. ముప్పదిరోజుల వఱ కెవ్వరును నిందుఁ బ్రవేశింపఁగూడదు. అతని కొసగిన

మాటకు భిన్నముగ వర్తించినచో నాతఁడు తయారుచేయు దివ్యసుందర విగ్రహము చెడిపోవునేమో!" యని వారించెను. వా రందఱును వారి వారి గృహముల కరిగిరి.

ఆ రేయి ధ్వని మిక్కిలి యెక్కువయ్యెను. తృటికాలమైనను శాంతి లేకుండెను. తెలతెలవారగనే మజిల నా భూపతి నిజ మిత్రామాత్యభృత్యుల రావించి "పగటి శబ్దములకే యిన్ని దినములుగ జడియుచుండనవి రాత్రులందును బ్రారంభ మైనవే. అందునను గుండియ బ్రద్దలు చేయు విపరీత భయంకర ధ్వానములే! చేయఁదగు కార్యమేమి?" యని యడిగెను.

"ప్రభూ! మిన్ను విరిగి మీఁదఁబడునా యనునట్టి యీ శబ్దము లేమి! తుదకు మన పట్టణ మంతయుఁగూడ యదరిపోయి నేలఁ గూలునట్లున్నదే? మన మేల లోనఁ బ్రవేశింప రాదు?" అని యొక మంత్రి చెప్పెను.

"మన మట్లొనర్చినచో విగ్రహము చెడిపోవునేమో!" యని రాజు సందేహించెను.

"దేవా! కీడెంచి మే లెంచుఁడు. ఉపేక్షించినచో నా దుర్మార్గునివలన లక్షలకొలది రూప్యములు వెచ్చించికట్టించిన దేవాలయమునకే భంగము వాటిలునేమో యను సంశయము వొడముచున్నది. విగ్రహము లభింపకున్న మానె. ఆలయ మైనను దక్కినఁ జాలును" అని యా మంత్రి యనియెను. అప్పలుకులు రాజునకు భీతావహ కారణము లాయెను. 'నిజమే! ఆ దుర్మార్గుఁడు దేవాలయము నంతయు నాశన

మొనర్చుచుండవచ్చును. అటులఁ గానిచో నొక చిన్న విగ్రహమును జేయుట కింత ధ్వనిఁ జేయవలసిన యగత్యమేమి? అంతియేగాక రాత్రులయందునుఁ గూడ శబ్దము గల్గుచున్నదే. వాని కొక్క దివ్యోయైనను మన మియ్యలేదు. చీకటియందు వాఁ డెట్లుపనిఁ జేయఁగలడు? మీఁదుమిక్కిలి వాఁడు వృద్ధుఁడు. కన్ను లెట్లగపడును?' అని సంశయించుచు రాజు బలుక, 'కంబములు విరుగఁగొట్టుటకు వెలుతురేల?' యని యా మంత్రి బలుకుచు నా రాజు సంశయము నతిశయింపఁ జేసెను. ఓహో! దీని మర్మ మంతయు నవగతమయ్యెను. ఏమైననుగానిండు. రండు. గొడ్డండ్రు తెండు. తలుపులఁ బగులగొట్టుఁడు. ఆలయమును గాపాడుఁడు. "ఆలస్యమమృతం విషం" అనుచు వారినందఱ వెంటనిడుకొని పోయి యాలయ కవాట విచ్ఛిన్న మొనర్చి లోనఁజొచ్చిరి. ఆ చిత్రకారుఁడొక పాడైన విగ్రహము చెంతఁ జేరాకరించి యాసీనుఁడై యుండెను. కాలుసేతు లందముగ లేక యా విగ్రహ మసహ్యాకరముగ నుండెను. రాజు వానిచెంత కరిగి "ఓరీ దుర్మార్గా! ఇదియేనా నీవు నుడివిన యా జగన్నాథుని విగ్రహము? దీనికిం బ్రతి ఫలము శిరఃఖండనమే" యని దూషించెను.

అంత నా ముదుసలి మందహాస మొనర్చుచు "రాజా! నీ ప్రేలితోనే నీకన్నుఁ బొడుచుకొంటివే? నే డిరువదియొక టవ దినమేగదా! ఇంత తొందఱపడితివేల? జగత్పతి నిజ స్వరూపముఁ గాంచుటకు ముప్పదిరోజులైన మనోనిగ్రహముం బొందలేకుంటివా!" అని ఛీ కొట్టెను.

అంత నా నరపాలుఁడు తన తొందరపాటునకుఁ దల వాల్చెను. ఆలయమం దొక పూరిపుడకయైన చెక్కు చెదర కుండెను. చెడిపోయిన యా విగ్రహముంగాంచి 'దీనినిప్పు' డేమి చేయవలయు ?" నని రా జడిగెను. "దీనినే ప్రతిష్ఠించి యర్చింపుము. భగవంతుఁడు సర్వోపగతుఁడు. సురూప కురూపముల నతఁడు పాటింపఁడు. కాలుసేతు లున్నను లేకున్నను నాతఁడు సరకుఁ గొనఁడు. ఎల్లయెడల నిండి నిబిడీకృతుఁడై యుండును. భక్తు లీ విగ్రహమునుండి యిది గ్రహింతురుగాక !" యని యదృశ్యుఁ డాయెను.

## 22. వింత శాపము

నాఁడు గొప్ప పండుగ. భోజనమున కెందఱో యాహ్వానింపఁబడిరి. కాని పిలువకయే యొకఁడు భోజనమున కరుదెంచెను. ఇంటి యజమానుఁడు వానిం గాంచి, "పిలువని పేరంటము చెప్పని యొక్క ప్రొద్దన్నట్లు నీ వెవఁడవోయి ? వేళకు దూకితివి. వెళ్ళుము" అని తరుమఁగొట్టెను. కాని య య్యభ్యాగతి బెదరిపోక, " నేడు నీవు భోజనముఁ బెట్టకుంటివా, చూడుము. ప్రక్క యూరియందును నిన్న నా కన్నముఁబెట్ట నిరాకరింప నే నొక పనిఁ జేసితిని. దానినే యిచ్చటను జేయఁగలను. జాగ్రత సుమీ : అది గమనించి నీ యిచ్చవచ్చిన ట్లొనర్పుము" అని ఘాటుగఁ బలికెను.

ఆ వాగాడంబరమున కా యజమాని జడిసెను. తనయింట నేమైన యవాంతరములు జరిపించునేమో యని భయపడెను.

కొంచె మిబ్బందియైనను సరియేయని తృప్తిగ నాతనికి భోజన మిడెను. తాంబూల మొసగుచు, "అయ్యా! నాపై కయ్యము నకుఁ గాలుదువ్వుచు వచ్చితిరే! ప్రక్కయూరివారు భోజనముం బెట్టి సత్కరింపనందులకు మీరం దేమొనర్చితిరి?" అని యా గృహస్థుఁ డడిగెను. "పస్తుంటిని" అని యాతఁడు బెట్టుగ నుత్తర మొసఁగెను. "ఇదియేనా యావిచిత్రకార్యము!" అని యా గృహమేధి ఘుక్కపై వ్రేలిడుకొనియెను.

## 23. సమయస్ఫూర్తి

కృష్ణుఁడు కుబేరుఁడు, చక్కని సమయస్ఫూర్తి గలవాఁడు. అనుగుణభార్యాసహితుఁడు. కాని యపుత్రకుఁడు. అయినను నా చింతను మనమునఁ బెట్టుకొనక నా దంపతు లిరువురును జిలుక గోరువంకలవలె నెంతయో నచ్చటముచ్చటగ సంసారమును గడుపుచుండిరి. ఒకనాటి సాయంసమయమున నా యాదర్శ మిథున మింటఁ గూర్చొని యేదో ఉబుసులాడుకొనుచుండిరి. ఎన్నిపర్యాయములో దారుణ కారాగారశిక్షల ననుభవించి అఘటనాఘటితుఁడని పేర్గాంచిన యొక గజదొంగ తమ యింటి యటకపైఁ బొంచియుండుటఁ గృష్ణుఁడు గనిపెట్టెను. బిగ్గరగ నరచినచో వాఁడు తప్పించుకొని వెడలిపోవుననియు, నిరుగుపొరుగువా రరుదెంచు లోపునఁ దమ కేదైన దప్పక హాని యొనర్చునేమోయనియు, నూరకొన్నచో రాత్రి కిల్లు గుల్ల జేయుటయేగాక తమ ప్రాణములకే ముప్పుఁదేగలఁ డనియుఁ బలువిధములఁజింతించి యొకచక్కటియుక్తిఁబన్నెను. వారిప్రక్కయింటనే దొంగలబట్టుటలో నద్వితీయుఁడని వన్నె

కెక్కిన రాముఁడు నివసించుచుండెను. కృష్ణుఁడు తమ సరసపు మాటలనుఁ గుటుంబ విషయములలోనికి మరల్చెను. తన భార్యతో, "ప్రియా! నీ వచిరకాలముననే పుత్రవతి వయ్యెదవు. శ్రీరాముని దయవలన మనకుఁ గొమరుఁడే యుదయించుచో వానికి రాముఁడని నామకరణ మొనర్తును. అయిదవ యేటనే యక్షరాభ్యాస మొనర్చి వానిఁ బడికిబంపుదును. నిత్యమును సాయంకాలమున 5-30 గంటలకుఁ దప్పక నింటికి రావలయునని యాజ్ఞాపింతు" ననియెను.

"అటుల రాకున్న నేమి చేయుదువు?" అని యామె యడిగెను.

"రామా! రామా! యని యిట్లు బిగ్గరగ నరతును." అని కృష్ణుఁడనుచు "రామా! రామా!" యని కేక వైచెను.

"అప్పటికిని రాకుండినచో నేమిచేయుదురు?" అని యామె మరల నవ్వుచు ననియెను.

"మరల రామా! రామా! యని వాఁడు వచ్చువఱకు నిట్లే యఱచుచుందును" అని "రామా! రామా! రామా! రామా!" యని యెలుఁగెత్తి యనేక మారు లఱచెను. ఆ కేకలు విని ప్రక్కయింటి రాముఁడును తదితరులును గృష్ణున కేదియో హాని గల్గెనని పరువెత్తుకొని వచ్చిరి. అట్లఱచినందులకుఁ గారణ మడిగిరి.

రామునిఁజూచి! "ఏమియు లేదు రామా! ఆ యటుకపైని పెద్దమనుష్యుఁడు నీకొఱకై వేచియున్నఁవా" డని యా

దొంగను జూపెను. వెంటనే వానిం బట్టుకొని న్యాయస్థానమునకుం గొంపోవ వానికి దీర్ఘకాల కారాగారవాస శిక్ష విధింపఁబడెను.

తన శిక్షకుఁ గారకుఁడైన ఆ ధనికునిపైఁ బగఁదీర్చుకొనవలయునని యా తస్కరుండు తీర్మానించుకొనెను. శిక్ష పూర్తిగ ననుభవించి విడుదలయైన వెనుక నొకనాటి సాయంసమయమున బ్రొద్దుగ్రుంకియుఁ గ్రుంకక మునుపే కృష్ణుని పెరటియందలి దిబ్బగుంటం బొంచియుండెను. అందు దాగుకొనినచో దన్నెవరునుఁ గనుఁగొనలేరని యాతఁడు గట్టిగ నమ్మెను.

కృష్ణుఁ డానాఁడు పెందలకడనే రాత్రిభోజన మొనర్చి కాలుసేతులు శుభ్రపఱచుకొనుటకుఁ దన యలవాటుచొప్పున నా దిబ్బకడకే యేగెను. మొదటి పర్యాయము పుక్కిలించి యుమ్మివేయుచుండగనే యా గోతిలో నేదియో గదలుచున్నటులఁ దోచెను. పరికించిచూచి యెవరో దొంగయై యుండునని భావించెను. కడవలు కడవలుగఁ బుక్కిలించుటకు నీరు తెమ్మని భార్యను బలవంతపెట్ట సాగెను. పుక్కిలించిన నీటినంతయు నా చోరునిపై నుమియుచుండెను. ఎటులైనఁ నా కృష్ణుని కంటఁబడరాదను దీక్షవహించి యా చోరుఁడు కదలక మెదలక యందే గూర్చుండి హాయిగ శీకరాంబుస్నాన మొనర్చుచుండెను. కృష్ణుని భార్య తన యజమానుని వింత శేష్టలకు కారణ మూహింపలేక, "ఇన్ని కడవల నీరు ఖాళీ యొనర్చితిరేల? మీ నోరేమైన అరుచిగ

నున్నదా? యైనదా? ఇఁక నే నొక చెంబెడు నీరైనను తేఁజాలను. నావలన గాదు, మీయిష్ట” మని కసరుకొనెను. అంతఁ గృష్ణుఁ డామెపై నుమిసెను. దిక్కు తెలియక పాప మా యువతి తనభర్తకు మతి సెడినదనియెంచి పెద్ద గగ్గోలుఁ జేయ సాగెను. అది విని రాముఁడును, తదితరులును బరువెత్తుకొని వచ్చిరి. జరిగిన యుదంతము నెల్ల నామెవలన విని యట్లుమి యుటకుఁ గారణమేమని కృష్ణునడిగిరి. అంత కృష్ణుఁడు. “ఈమె విశ్వాసఘాతుకురాలు. ఇన్ని సంవత్సరములుగ నన్నవస్త్ర ముల నొసఁగి కాపాడుచుండియు నొక్కపర్యాయ మమియ గనే తిన్నయింటివాసము లెన్నుచందమున నింత రచ్చఁ దెచ్చి పెట్టినది. అదిగో! ఆ దాగుకొనుయున్న వానింజూఁడు. వాని కెప్పుడైన పిడికెడు మెతుకులనుగాని, యొక చింపిరి పేలికనైనఁ గాని యిచ్చి యుంటినా! పాపము! సుమారు నూరు మార్లైనను వానిపై నుమిసియుందునే. వాఁ డొక్కమాటయైన నింత వఱకు ననలేదు.” అని ఆ చోరునిం జూపెను. అందుమూగిన వారెల్లను యా చోరునిఁబట్టి కట్టి న్యాయస్థానమునకుం గొంపోయిరి. న్యాయమూర్తి వానికి దీర్ఘకాలపు కఠినశిక్ష విధించెను.

## 24. నాటక ప్రదర్శనము

మును పొక పేర్గాంచిన నటకుఁడు తిరువాఙ్కూరు రాజ్యమున కేగెను. రాజదర్శనమునకై సచివు నాశ్రయించెను. అతఁడా విషయమును రాజున కెరింగించి వానిని స్తుతించెను.

రా :— అత డే వేషమును వేయును?

స:—రావణ వేషము నత్యద్భుతముగ నటించును. మనము కృతయుగమున నుండకపోయినను రంగస్థలమున నాతనిం గాంచినచో నిజముగ రావణుఁడే యవతరించెనా యను నట్లుండఁగలఁడు."

రా:—ఓహో! అట్టులైన నాటకము పేరు?

స:—హనుమద్రాయబారము.

రా:—మననగరుననాడింతము. వలయునేర్పాటులగావింపుము.

నటకుఁడు తన నటనాచాతుర్యము నంతయు నా రాజుగారి యెదుటఁ బ్రదర్శించి గొప్ప బహూకృతుల నందఁదలచెను, రంగస్థలమున రావణుఁడు సింహాసననారూఢుఁడాయెను. ఎదుట హనుమంతుఁడు శ్రీరామునిగుణగణములను, శక్తి సామర్థ్యముల నుగ్గడింప నారంభించెను. రావణుఁడు రామునిఁ దూలనాడుచు "చండ ప్రచండ మార్తాండ మండల తేజుండగు నీ రావణుఁ డీ మహీమండలంబున నెవ్వారికి క్షేమియు నెన్నటికి నొసఁగఁజాలఁడు. ఒక్కనికైనను లేచి నమస్కరింపఁడు. అందఱు నీ రావణసార్వభౌమునకు గులాములే"సుమా! యని పల్కుచు గంభీరముగ నటించుచుండ నాభూపతి నిజామాత్య భృత్యబృందములు వెంటరా నాటకస్థలిఁ బ్రవేశించెను. రావణ నటకుఁ డా భూపతిరాక గమనించి వెంటనే దిగ్గున పీఠముపై నుండి లేచి నిలువంబడి నమస్కరించెను.

అంత నా భూవరుఁడు తనమంత్రితో "నీవంతగఁబొగడిన దీ నటకునేనా! అబ్బే! రావణుఁడనని నటించుచు, దేశము

లోని రాజులనెల్ల ధిక్కరించి, తానెవ్వరికిని లేచి నమస్కరించ నని నుడువుచు, నావంటి చిన్నరాజునకే లేచి ప్రణామము లాచరించుచున్నాఁడే!" యని విసుగుఁజెంది వెడలిపోయెను.

## 25. వేతనముల తారతమ్యము

"న్యాయమున కిపుడుకాల మెక్కడిది? పగలంతయు చెమట యూడ్చి కష్టించువానికి ముప్పదిదినములకు ఏడురూపాయలు. మోటారుకార్లలో నిటు నటుఁ దిరుగుచుఁ గాలముఁబుచ్చు దివానుగారికి నెలకు రెండువేలు. ఏమి టీ యన్యాయము?" అని యొక సేవకుఁడు గొణుగుకొనుచుండఁ తిరువాన్కూరు ప్రభువు చెవినిఁ బడెను. వాని పలుకు లసంగతములని నిరూపింపఁదలఁచెను. దూరమున నొక పల్లకి వచ్చుచుండుటఁగాంచి యందలి ప్రయాణీకు లెవరోఁ గనుఁగొని రమ్మని యా పరిచారకునిఁ బంపెను. వాఁడు పరుగు పరుగునఁ బోయి వచ్చి "శ్రీశంకరాచార్యులవా"రనినుడివెను. 'వా రేమఠాధిపతులు?' అని రాజడిగెను. వాఁడు మఱల పరుగునఁబోయివచ్చి 'శృంగేరి మఠాధిపతులఁట" యనెను. "వారిప్పు డెచ్చటనుండి వచ్చుచున్నారు?" అని యా ప్రభువడిగెను. మఱల పరుగెత్తిపోయివచ్చి "పెంకోటనుండి యఁట" యనియెను. "అయిన వా రెచ్చటికి బోవుచున్నారు?" అని మఱల యాతేఁడడిగెను. మఱల పరుగిడి పోయివచ్చి 'కాలడి కట' యని వాఁడు దెల్పెను. "అటులైన వా రిచట నాగుదురా?" యని యారా జడిగెను. 'అవునట' యని వాఁడు మఱలఁబోయివచ్చి తెలిపెను. "ఎంతకాల"మని యా రాజు మఱల ప్రశ్నించెను. మఱల వగర్చుచు వాఁడు పరు

వె_త్తిపోయివచ్చి 'యొక దినమేనట' యని యెఱింగించెను. వా రెక్కడ విడియుదు రట ?" అని యా ప్రభువు మఱల నడిగెను. ఆ పల్లకి రాచనగరునకు దూరదూరముగఁ బోవు చుండెను. అందువలన నా భటుఁడు మఱల మఱలఁ బోవు నప్పటికిఁ బ్రతిపర్యాయమున కొక్కొక ఫర్లాంగుదూర మెక్కు_వగుచుండెను. వాఁడు రోయుచు రొప్పుచు మఱలఁ బరుగెత్తుకొని పోయివచ్చి 'దేవాలయమున కానుకొనియుండు మఠము లోనట" యని తెలిపెను. "వారిని నేను దర్శింప వచ్చునా ?" యని యా తేఁడు మఱల నడిగెను. నురుగులుఁ గార్చుకొనుచు మఱల బోయివచ్చి 'యవునట' యని నుడి వెను. "వారి కెప్పుడు వ్యవధియుండునఁట ?" యని మఱల నా రా జడిగెను. మఱల వాఁడు కాళ్ళీడ్చుకొనుచు బరుగె_త్తి కొని పోయివచ్చి "మూఁడుగంటలకట" యని నుడువుచు కడు డస్సిపోయి మొదలునరికిన తరువువలె స్పృహదప్పి క్రింద బడెను. అప్పటికే యా యందలము మఠము జేరెను.

మంత్రిని రమ్మని వ_ర్తమాన మంపెను. ఆ విషయము లేమియు నతఁడెఱుఁగఁడు. వచ్చుచుండగనే పల్లకిలో మఠ మున కేగినవారెవ్వరోఁ గనుగొని రమ్మనెను. అర్ధగంటలో నాతఁడు తిరిగివచ్చి యా భృత్యునెదుటనే రాజున కిట్లనియె: "ప్రభూ ! వారు శృంగేరి పీఠాధిపతులు. శ్రీశంకరాచార్యుల వారు. పెంకోటనుండి కాలడి కరుగుచున్నారు. మనయూరి మఠమున నొక రోజంతయు నుందురఁట. మీరు వారినిఁ జూడగోరుచో మూఁడుగంటలకు వ్యవధి యుండునఁట. దేవా లయమున నేటి సాయంకాలముననే పూజలుసల్పుదురఁట."

రాజుగారావర్తమాన మాలకించి నౌకరునిం బిలిచి "ఓరీ చూచితివా! నీవు తొమ్మిది పర్యాయములు పరుగెత్తి, పరుగెత్తి, యలసి సొలసి, యైదుగంటల కాలములో నెరిఁగించిన విషయము నీతఁ డర్ధగంటలో నొకే పర్యాయమునఁ దెలిసికొని వచ్చెను. మీ యిరువురి వేతనముల భేదమునకుఁ దగిన కారణ మరసితివా?" యనెను. బదులు మాటాడక వాఁడు పరాభవముచేఁ దలవంచుకొనియె.

## 26. మోసగానితో నుమ్మడి సేద్యము

ఒక యూర నొక మాయల మరాఠీ యుండెను. వాఁడొక యమాయకునితోఁ గమతపు సేద్యమున కొడంబడికఁ జేసికొనెను. మొదట నయ్యిరువురును బంగాళాదుంపల పైరు వేసిరి. దుంపనాటునపుడే యా మాయావి "నీకు పై ఫలితముఁ గావలయునా, లేక క్రిందిఫలితముఁ గావలయునా?"యని తన పొత్తుగాని నడిగెను. "పై పంటయే" యని వాఁడు గోరెను, ఆ మేరకే యిరువురును సమ్మతించిరి. దుంప త్రవ్వు కాలమున నా యభాగ్యున కేమియు దక్కకపోయెను.పడిన కష్టమంతయు బూడిదం బోసిన పన్నీరయ్యె. ఉల్లగడ్డ పంటయైన యనంతర మొక యరటితోటను వేయ నా మోసగాఁడు తన భాగస్థుని పురిగొల్పెను. "ఈపర్యాయమున నీకేమిగావలయు?"నని మరల నాధూర్తుఁ డా వెంగళప్పనడిగెను. ఉల్లగడ్డల పంట వంటిదే యరటిపంటయునై యుండునని "క్రిందిపంట గావలయు"నని వాఁడు గట్టిగ నొక్కి చెప్పెను. అటులనే నా యిరువురును

మలల నొప్పిద మొనర్చుకొనిరి. పాపము, ఈ పర్యాయ
మును నా మతిహీనుఁడు మోసపోయెను.

## 27. కాసుకు గడ్డితినిన, ఉన్నదికాస్త పోవును

వణిజుఁ డొకఁడు కొంతధనము నెత్తుకొని వ్యాపారము
నకై బయలుదేరెను. అడవిమార్గమునఁ బోవలసియుండుటచే
దారి తోడు గావలసివచ్చెను. ధీసత్త్వు లెల్లరు నేబది రూప్య
ముల భృతికిం దక్కువ రామనిరి. అంత సొమ్మును వెచ్చింప
నాతఁ డియ్యకొనకుండెను. తుదకొక యగస్త్యభ్రాత పది
రూప్యముల కొప్పుకొనుటచే తత్క్షణమే యావర్తకుఁ డా
పైకము నిచ్చివేసెను. వాఁ డా సొమ్మును వల్లెచెంగున
ముడిచి నడుమున దోపుకొని యా బేహారివెంట పయన
మాయెను. చీకటిపడువేళకు వా రా యడవిఁ జేరిరి. అది
కాలాంతకులవంటి దోపి గాండ్ర కాటపట్టని ప్రతీతి. అది
ముందే యెఱిఁగినవాఁ డగుటచే నా వర్తకుఁ డా యడవియం
దడుగిడుచుండగనే, వెనుకడుగు వేయుచు నడక సాగించు
చుండెను. బహుజాగరూకుఁడై నలుదిక్కులు పరికింపసాగెను.
కొంత దవ్వేగినపిదప గనుచూపు దూరమున నొక దొంగల
ముఠా తమవైపు వచ్చుచుండుటఁ గనిపెట్టెను. త్రోవప్రక్క
పొదలో దాగుకొను మని నుడువుచు కొంతదూర మేగి
యా సాహుకా రొక పొదమాటున భద్రముగఁ గూర్చుం
డెను. ఆ వెంగలి తన తలనుమాత్ర మొక పొదయందుంచి
నా పుంత కడ్డముగ కాళ్ళుఁజాపి బోరగిలఁ బరుండెను.

అప్పటికి బాగుగఁ గనుచీకటి పడెను. దొంగలెల్ల రక్షా పూర్వులై యరుదెంచుచుండిరి. చోరనాయకుఁడు మాత్రము వారికి ముందుగ వచ్చుచుండెను. అశ్వఖురమున కా వెంగలి కాళ్ళదగులుటచే నదికొంచెము ముందునకువంగెను. "జాగ్ర త్తగరండు; త్రోవలో నేదియో పెద్దమ్రాని వేరు నాగుఱ్ఱపుకాలు నకుదగిలినది." అని యాచోరనాయకుఁడు వెనుక వారిని హెచ్చ రించెను. అప్పలుకులువిని యా వీఱిడి క్రోధకషాయితాక్షుండై "ఏమీ! నా కాళ్ళను మ్రాని వేరనుచుంటివా? ఎంత మొన గాడవోయి! ఏనాటికైనను నీకాళ్ళకంటెను నా కాళ్ళే బాగుం డును సుమా!" యని లేచి నిలుచుండెను. చోరనాయకుఁడు విస్మయంబంది గుఱ్ఱము నాపెను. వాని యనుచరు లెల్లరు నా వీఱిడిని చుట్టుముట్టిరి. "నీయొద్ద నేమైన ధనమున్నదా?" యని యా దొర వాని నడుగ, "ఓరీ చండాలా! నే దరిద్రుఁడ నని దలచితివా, ఇదిగో! నాకడ పదిరూప్యము"లనుచు దాను కొంగును ముడిచికొనిన మూటఁ జూపెను. చోరులామూటను విప్పిరి. వాఁడు చెప్పినటుల పదిరూప్యము లేసరిగనుండెను. అది దొర గాంచి "ఇవి దొంగనాణ్యములుగ నుండనోపు! లేకున్న నెంత వెఱ్ఱివాఁడైనను తనవద్ద నున్న సొమ్మును మనకు తనం తటఁ దాఁ జూపునా!" యనెను. "ఓరీ! నేను నీ వంటి మోసగాఁడనుగాను. ఈ నాణెములను నా కొక ధన వంతుఁడగు వర్తకుఁ డొసఁగెను. మీకట్టి యనుమానమే యుండిన నదిగో వానియొద్దకే పోయి యడుగుఁడు. ఆ కనఁబడు పొదచాటున నయిదు వందల రూప్యముల సంచినిఁ చెంతఁ బెట్టుకొని

కూర్చొని యున్నవాఁడు. వీనిలోనొక్క దొంగనాణ్యమైనను గలదేమో వానినే యడుగు"మని చెప్పెను. వాఁడుచూపెట్టిన యారము మాటున పిల్లివలెఁ గూర్చుండి యుండిన నా బేహారినిఁ బట్టుకొని వానియొద్ద నున్న సొమ్మంతయుఁ బుచ్చుకొని యానందముతో నా చోరులెల్లరు వెళ్ళిరి. "కాసుకు గడ్డితినుటచే నున్న సొమ్మంతయుఁ గొల్లవోయెగా!" యని చింతించుచు నా వణిజుఁ డింటికేగెను.

## 28. పితృదేవతల కర్ఘ్యము

గురునానక్ హారద్వారమున కేగెను. బ్రాహ్మణు లనేకులు ప్రాఙ్ముఖులై పవిత్రగంగాతోయముల దోసిళ్ళనెత్తి యర్ఘ్యమును విడుచుండిరి. నానక్ అదిగాంచి పశ్చిమాభిముఖుఁడై యర్ఘ్యము వదలుచుండెను. బ్రాహ్మణు లా విచిత్రకృత్యమున కాశ్చర్యపడి "దానికర్థమే"మని ప్రశ్నించిరి. "మీరొనర్చుచుండు పని కర్థమేమి?" యని యాతఁడు వారినే యడిగెను. "మా పితృదేవతలకు గంగాజలముతోడ నర్ఘ్యప్రదానమొనర్చుచున్నార"మని వారు ప్రత్యుత్తరమొసగిరి. "నేనును పంజాబులోని నాతోటకు నీరుఁజల్లుచున్నాఁడ"నని నానక్ బదులుఁజెప్పెను. "ఓరీ యవివేకీ! పంజాబులోని తోటకీ నీ రెట్లు చేరును?" అని యా భూసురులు పరిహాసించిరి. "అయ్యా! మీ వంటి వివేకు లంతకంటెను నెంతయో దూరమున నుండువారికీ నీరు చేరునని దలఁచుచుండ, పంజాబునకు మాత్ర మీ నీ రేల చేరకుండును?" అని నానక్ నుడివెను. కొంత తడవు వారేమియు మాటలాడక నూరకుండిరి. ఒకవృద్ధ

బ్రాహ్మణుఁడు ముందున కరిగి, "అయిన మీరు మ మ్మేమి చేయమందు"రని నానక్ నడిగెను. "ఈ పిచ్చిపనులను వదలుఁడు. హరిని భజింపుఁడు" అని నానక్ ఉపదేశించెను. అంత నా విప్రుఁడు "అయ్యా! మాయర్ఘ్యములే పితృదేవతలకుఁ జేరనపుడు, మా కంఠధ్వను లెట్లు హరికి వినిపింపఁగలవు? కావున మీరు నుడువునదే నిజమైనచో మేముఁ జేయునదియు ఫలవంతమే యగు" ననియెను. మఱల నావిప్రులెల్లరు నర్ఘ్యప్రదానములకుఁ బూనుకొనిరి. అంత నానక్ నిరుత్తరుఁడై తన దారినిఁ బోయెను.

## 29. నానక్ పర్యటనము

గురునానక్ తనశిష్యుఁడు మార్దనుని తోడసంచారమునకు బయలు దేఱెను. వా రొక గ్రామముకడ కేగిరి. అం దొక్కరైనను వారిని 'వచ్చితివా, పోయితివా' యనియైన పలుకరింపకుండిరి. ఏ యింట గాని భోజనము దొరకకుండెను. మార్దనుఁడు తన కాకలియగుచున్నదనియు దాహమెత్తుచున్నదనియు నుడువ, "నాయనా! ఓర్పు వహింపుము. దేవుని లీలలు చిత్రములు, అన్నియును మన మంచికొఱకే" యని నానక్ నుడివెను. వారు మరునాఁ డా గ్రామమును వదలి పోవుటకుఁ బయనమైరి. "సతత మీ గ్రామ మిందే స్థిరముగ నుండుగాత!" యని నానక్ దీవించెను.

ప్రక్క గ్రామమున కేగిరి. అందు వారి కఖండ సన్మానమొసఁగఁబడెను. చెప్పినవిషయములెల్ల చెవియొగ్గివినుచుండిరి. మృష్టాన్న మొసఁగిరి. పెక్కు మంది శిష్యులైరి. వారు గ్రామ

మును వదలిపెట్టి పోవునపుడు, "ఈగ్రామము నిర్జనమగుగాక. ఈ గ్రామీయు లెల్లరును జెట్టు కొక పిట్టయై పోవుదురుగాక" యని నానక్ శపించెను. అప్పలుకులు విని మార్దనుఁడు నానక్ నిట్లడిగెను: "మీరు కడు విచిత్రవ్యక్తులు. శపింపఁదగిన యా గ్రామము నాశీర్వదించితిరి. దీవింపఁదగిన ఈ గ్రామమును శపించితిరి. కారణ మేమి?"

"అవును. నే నుడివిన దానిలో విస్మయపడఁదగిన యంశ మొకింతయైనను లేదు. సత్పురుషులు నభంబు నందలి నక్షత్రముల మాడ్కి నానాప్రదేశములయం దుండినచో వారి సత్ప్రవర్తనయు, దివ్యతేజమును నలుదిక్కులం బ్రాకును. లేనిచో ఘోరాటవిలోని సౌగంధికములే యగుదురు. ప్లేగు వ్యాధిచే బాధపడువారి నొంటరిగ వదలివేయు చందమున దుర్జనులకితర ప్రపంచముతోడి సంబంధ ముండఁగూడదు" అని నానక్ విశదపఱచెను.

## 30. లోభి దాతయగుట

అతఁ డచిరకాలముననే కోటికి పడగ నెత్తెను. దశగృహాధిపతి. కాని పాపిష్టయాశ పడగ లెత్తుచునే యుండును. కడు పిసినిగొట్టు. తాఁ దినఁడు. ఒరుల కంతకుమునుపే పెట్టఁడు. తుదకుఁ తన యింటిలోనివారిఁ గూడఁ దిననీయఁడు. దానమను శబ్దమున కితరులు తన కిచ్చుటయే యని యాతని వ్యాఖ్య. ఆతని జీవితములో నొక్క చిల్లిగవ్వనైన నితరుల కొసఁగి యెఱుఁగడు.

గురునానకొక్కకపరి యాతని చెంత కరిగెను. అనాథ శరణాలయమున కొక గృహమును దాన మిమ్మని యాశ్ర యించెను. "గురూజీ! 'దశకంఠ, దశరథు'లను బిరుదములు గలవారి వలెనే నేనును 'దశగృహాధిపతి' యని యనిపించు కొనఁ దలఁచి యాయిండ్ల నెంతయో కష్టపడి సంపాదించితిని. లెక్కసరిగ నున్నది. పదికొకటి తక్కువగనైనను, లేక యెక్కువగ నైనను నుండిన పక్షమున మనసార యెట్టి యభ్యంతరమును లేక తమ కొకటి తప్పక నొసఁగియుండెడి వాఁడనే. మీ రడుగుటయు నే గాదనుటయునా?" యని యాతఁడు నుడివెను. నానక్ బదులు పలుకక యూరకుండెను. అప్పుడే యొక ముష్టివాఁ డరుదెంచి, 'భిక్షాం దేహి' యని వేడెను. ధనికుఁడు వానిం జూచి "పళ్ళె మెక్కడ?" యని యడిగెను. తన కేదియో త్రవ్వి తలకెత్తు నని యా భిక్షుకుఁ డువ్విళ్ళూరుచు వెంటనే తన జోలెనుండి యొక కంచముఁ దీసెను. అది గాంచి యా ధనికుఁడు "చంపవచ్చినవాఁడు కత్తిని యేమరనటుల కంచమును సిద్ధముగనే కొనివచ్చితివా? ఇట్టి యుంఛవృత్తిని ప్రోత్సహింపరాదు! పో పో! అచ్చుఁబోడిచిన యాఁబోతువలె నున్నాఁడవు! ఆ కంచము నమ్ముకొని భుజింపుము" అని తిట్టి వానిం దరిమివేసెను. నానక్ అది యంతయు గమనించి పల్లెత్తు మాటయైన ననక వెళ్ళిపోయెను.

మఱునాఁడు నానకొక నూదిని యాధనికుని కడకుం గొంపోయి దానిని దాచుమని యడిగెను. 'గురూజీ! తప్పక యటులే దాచియిత్తును. మీరుఁ చేయిఁ జాచుట; నే లేదనుటయా!

మఱల మీా కిది యెప్పుడు గావలయును?' అని యా ధనాఢ్యుఁ డడుగ, "మన మిర్వురము‌ను కాలధర్మము నొందిన వెనుక పరలోకమున నా కది యొసఁగు" మని యా మహాసీయుఁడు పల్కెను. "గురుపుంగవా! పరలోకమునకు దాని నెట్లుఁ గొని రాఁగలను?" అని యా ధనవంతుఁ డడిగెను. "అయ్యా! అగ ణితములగు నీ ధనరాసులం గొనిపోవునపుడు దీనిం గూడ దయ యుంచి మీా వెంటఁ గొనిరండు. ఇది యెంత భారమగును?" అని నానకు నుడివెను. ఆ మాటల యంతరార్థము నాతఁడు గ్రహించెను. తా ననుభవింపక, పరులకీయక ధనమునంతయు నటుల దాచుటలో గల యవివేకము మనసునకుఁ దోఁచెను. నోటికిఁ దాళము వైచుకొని సిగ్గుచేఁ దల వంచుకొనెను. 'తాను మరణించిన వెనుక ధనసంచయములెల్ల దన వెంటఁ రాఁజాల వనియు, నీ లోకముననే వానినెల్ల వదలిపోవలసి వచ్చుననియు లోభులకుఁ దోఁచుట యెంత యాశ్చర్యకరము!" అని నానక్ పలికెను. అంత నా కోటీశ్వరుఁడు తన పుత్రమిత్ర కళత్రాదులకు వదలిపెట్టక తన వెంటనే స్వార్జితస్వర్ణరాసుల నెల్లఁగొనిపోయి నచో వారి కందఱకునుఁ గూడ నెంత విస్మయాస్పద మగును?" అనియెను. అప్పలుకుల కా గురుపుంగవుం డిట్టులనియె: 'నిజమే వివేకవంతుఁడు తాను తరించుకొఱకే యెక్కువగ చింతిం చును. ఇతరుల బ్రతుకుకొఱకుఁ గాదు. ఈ ధన కనక వస్తు వాహనము లేవియు నీవు [illegible] వను విషయ మెఱిఁగియుఁ పేదలకు [illegible]త భాగమైనఁ బంచిపెట్టనొల్లవేల? ఇహలోకపు దానధర్మ[illegible]పరలోకపుఁ

బాడియావు లగును. ఇందు ముష్టిని చెట్టులైనచో నందును భగవంతుఁడు ముష్టి నిడఁడు."

అప్పలుకులు వాని డెందమున బాగుగ నాటుకొనెను. వెంటనే యొక యింటినిఁ, బదివేల రూప్యములనుఁ బేదలకు వినియోగించు కొఱకు నానకున కొసఁగెను. ఆ నాటినుండి యంతకుమును పెంతలోభిగనుండెనో యంతధారాళముగ దాన ధర్మములఁ జేయసాగెను. ఒకనాఁడు వానికుమారుఁడు, "తండ్రీ! దినమున కెంత వెచ్చించు చున్నా"వని యడుగ నాతఁడు, "వెచ్చించు చున్నావని యడుగకుము. ఎంతదాచు కొను చున్నావని యడుగు" మని ప్రత్యుత్తర మొసఁగెను.

## 31. పూజారికి జ్ఞానోపదేశము

అవ్వాయి గొప్ప కవయిత్రి. ఒకనాఁడు శివాలయమున విగ్రహమున కెదురుగ నామె గాళ్ళుఁ జాపుకొని కూర్చుండి యుండెను. అర్చకుఁడదిగాంచి కడు కుపితుఁడై, "దేవుని కెదురుఁగ గాళ్ళుఁజాచుకొని కూర్చుంటివా? నీ వెంతదానవమ్మా" యని విదిలించెను. "అయ్యా! నే నజ్ఞానురాలను. క్షమింపుము. దేవుఁడు లేని దిక్కెద్దియో దయయుంచి తెలుపుము. ఆ దిక్కునకే పాదములు చాచెదను" అని యామె యడుగుచుండగనే నోట బదులు మాటలేక పూజారి లజ్జవడి నిలుచుండెను.

## 32. దేవాలయ నిర్మాణము

మండు టెండలు. అతికా ళ్ళంటుకొనుచుండెను. వేడి గాడ్పులు విసరుచుండెను. చుట్టుప్రక్కల చెట్టు చేమ లెవ్వియు

లేకుండెను. ఒంటరిగ దారిప్రక్కన నున్న పొలములో ముచ్చుమటలుఁగారుచుండఁ దుడుచుకొనుచు నొడుదుడుకులు లేక నానందముతోఁ గూనరాగములుఁ దీయుచు నొక గొల్ల పిల్లవాఁ డొక గోపురమును మట్టితో నిర్మించుచుండెను. కనిష్కుఁడు ప్రచ్ఛన్న వేషమున నశ్వారూఢుఁడై యమ్మార్గమునఁ బోవుచు నది గాంచి ముసిముసి నవ్వులు నవ్వుకొనెను. రాజ్యమున నందందుఁ దిరిగి సాయంకాలమున గృహోన్ముఖుఁడై యేగునపుడుఁ గూడ నాబాలుఁ డా గోపురమునుఁ గట్టుచునే యుండుట గాంచెను. అది యారడుగుల యెత్తుండెను. చుట్టును ప్రాకారములతో నొప్పి ముద్దులుఁ గొలుపుచుండెను. సార్వభౌముఁ డా బాలుని భక్తికి సంతసించి వాని చెంత కరిగెను. "అబ్బాయీ! నీవేమిచేయుచున్నావు?." "నేనొక గోపురమును నిర్మించుచున్నాను." "అది యెవరికి?". "బుద్ధభగవానునకు." "అంత గొప్ప మహానీయున కింత చిన్ని యాలయమా!" ఆ బాలుఁ డెన్న డా రాజునుఁ జూచి యెఱుఁగ నందున, "బ్రహ్మాండమైన యాలయమునుఁ గట్టించుటకు నే నేమైన కనిష్క చక్రవర్తినా! 'ఉడుత కుడుతా భక్తి' యనునటుల ప్రతి మనుజుఁడును శక్తికొలఁదిఁ జేయుటలో నవమాన మేమి? నే నొక నిరుపేదనగు యాదవుఁడను. నా శక్తికిఁదగిన దిదియే!" యనియెను. అబ్బాలుని సద్భక్తికి రా జానందించి, "అబ్బాయీ! కనిష్కసార్వభౌముఁడే యొక యాలయమునుఁ గట్టింపవలసియుండినచో నది యెట్లుండిన బాగుండును?" అని యడిగెను. 'నాలుగు వందల యడుగుల యెత్తుండ వలయును. బంగారు బుద్ధవిగ్ర

హాము నందుఁ జేసి యుంచవలయును. కాని చక్రవర్తులుఁ గూడ గుళ్లుగోపురములుఁ గట్టింతురా! అట్టి మహత్కార్యముల నెల్ల పేదలే జేయవలయు"నని యా పసిబాలుఁ డుత్తర మొసఁగెను.

కనిష్కుఁడు తన నగరున కరిగి వెంటనే నాలుగువందల యడుగుల యెత్తున నొక బౌద్ధదేవాలయమును, జాతరూప బుద్ధవిగ్రహామునుఁ జేయింప మంత్రుల కాజ్ఞ నొసంగెను.

ఏడు సంవత్సరముల కది పూర్తి యయ్యెను. అనంతర మా రాజపుంగవుఁ డొకనాఁ డా గొల్లవానిఁ బిలిపించెను. వాఁ డప్పటికే బౌద్ధ సన్న్యాసియైయుండెను. మేలిమి దుస్తులలోనున్న యా కనిష్కుఁడే యానాటి యశ్వారూఢుఁ డని వాఁడు గుర్తించుకొనలేకపోయెను. ఆ భిక్షుకునిం గాంచి యా భూవరుఁడు "సోదరా! ఒకానొక సమయమున నే నెన్నటికిని బుద్ధభగవానుని యాలయమును గట్టింపఁజాలనంటివి. ఇదిగో ఇయ్యది నేనే కట్టించితిని. నీ మనసున కిది తృప్తికరముగ నున్నదా?" యని యడిగెను.

"ప్రభూ! చాల అందముగ నున్నది. ఆ నాఁ డా యాశ్వికునితో నే నేదో బాల్యచాపల్యమున నంటిని. నా మనసునకు మంచిదని తోచిన విషయములఁ దెలిపితిని. కాని యాతఁ డవ్విషయముల నెల్ల పూసగ్రుచ్చినటులఁ దమ కెఱిఁగించు నని తలఁపనైతిని. మన్నింపుఁడు. కాని యానాటి నాయవ్యక్తవచనములే యిట్టి సత్ఫలిత మొసఁగినందులకు మిగుల నానందముగ

నున్నది!" యని యా సన్న్యాసి నుడివెను. అంత నా భూపతి "నేనే యా యాశ్రీకుఁడ" ననుచు తన మేల్మిదుకూలములఁ దీసివైచి యానాఁడు తా ధరించిన యుడుపులతో వానికడ కరుదెంచి "నిన్నీ దేవాలయమునకుఁ బ్రధానార్చకునిగఁ నేర్పాటు జేయుచున్నాఁడను. మునుపటి భక్తిని వీడక నిత్యమునుఁ బూజాపునస్కారములు సల్పుచుండు" మనియెను.

## 33. పరివర్తనము

సస్ప బ్రాహ్మణుఁడు ధీనిధి, వంగదేశీయుఁడు. దాహిర్ ఆతని పుత్రుఁడు. అతని సమకాలికుఁ డగు వంగదేశాధిపతి దుర్వినీతుఁడుగ నుండెను. ధన సంచయములనెల్ల దుర్వ్యయ మొనర్చుచుండెను. తన ప్రజల మంచిచెడ్డల నరయక పరిపాలన నిర్లక్ష్య మొనర్చుచుండెను. అహోరాత్రములు దురోదరమునఁ గాలముఁ బుచ్చుచుండెను. పలుగాకులఁ బంచఁ జేర్చుకొని సత్పురుషులును, శ్రేయోభిలాషులు నగు భృత్యవర్గములఁ బారఁద్రోలెను. ప్రియంవదులును, ధనాశాపరులు నునై దగ్గరజేరిన యాషాఢభూతులనెల్ల నెచ్చెలు లని నమ్మి వారికెల్ల ధనమును దోచిపెట్టుచుండెను. యుద్ధపద్ధతుల నెల్ల బూర్వపక్షు మొనర్చెను.

సస్ప యాతేని దుష్ప్రవర్తనల నెల్లఁ మాన్ప సంకల్పించెను. 'వజ్రం వజ్రేణ భిజ్యతే' అను వచనము ననుసరించి హితోపదేశము లా ప్రభువు చెవి కెక్కవని నిర్ణయించి చతురంగము తోనే యాతని పెడబుద్ధి మాన్ప దీర్మానించెను. అత్యుతా

హాముం గొల్పు చెస్సను యాటనుఁ గనిపెట్టెను. రాజునఁకది మనసున కింపుఁ గల్గించెను. రేఁబవళ్ళాయాట యాడుటయందే మనసునులగ్నపఱచెను; పాచికలాడుటబరిత్యజించెను. పూర్తిగ నశించిపోయిన వైజ్ఞానిక విషయములనుఁ పునర్జీవింపఁ జేసికొనెను. పరిపాలన యందు ప్రజల ప్రముఖ పాత్రతావశ్యకతను గ్రహించెను. విస్మరించిని సమరపద్ధతులు బుద్ధికిఁదెచ్చుకొనెను. సన్నను బహూకరింపఁ గోరెను. "కావలసినది కోరుకొనుము. ఒసఁగెద" ననియెను. "సరియే" యని సన్న "ఏవో కొన్ని బియ్యపుగింజలు మాత్ర మొసగినఁ జాలును. నా చదరంగములోని మొదటి చతురమున కొకటియు, రెండవ చతురమునకు రెండును, మూడవ చతురమునకు రెండవదాని వర్గమును అనఁగా నాల్గును, నాల్గవదానికి మూడవదాని వర్గమును అనగా బదునారును, నైదవదానికి నాల్గవదానివర్గమును అనగా రెండువందలయేబదియారును, ఈ విధముననే ప్రతిదానికిని వెనుకటి చతురపు వర్గమునకు వచ్చునట్టి బియ్యపుగింజల వంతున పదునాల్గు చతురములకును లెక్కించి యిప్పింపుఁడు. నాకు మఱేమియు వలదు" అని యడిగెను. అంత నా ప్రభువు "ఇంతియే! ఇంత స్వల్పముగ నన్ను గోరుటలో మీరే ప్రథములు" అనుచు దన సచివునిఁ బిలిచి సన్న కోరిన బియ్యము నిమ్మనియెను. నాల్గు దినములు విధి విరామములు లేక యా యమాత్యుఁడు లెక్కించి రాజుకడకేగి "ప్రభూ! సన్నకోరినన్ని బియ్యము మనరాజ్యమున దొరకుట దుర్లభము. ఇతరప్రదేశములనుంచి దెప్పించుటకుఁ గావలసిన ధనమును మనకు లేదు.

అతనికి మీ రిచ్చెద ననిన బియ్యమునంతయు రాశిఁబోసినచో హిమాలయములను మించిపోవునేమో! కొనవలయు నని నైదుకోట్ల రూప్యముల విలువయగును" అని నుడువుచుండ గనే రాజు దిగ్భ్రమ జెందెను. ఏమి చేయుటకును దోఁచక మంత్రి లెక్కించిన కాగితముల నెల్లఁజూచుచు నిలువంబడెను! సన్నను జూచి, "కర్తవ్యమేమి? ఎఱవేసి చేపను లాగితిరే. ఏదో తండులము లేఁగదా కోరుటయని భ్రమించితిని" యని యా వంగరాజు విచారగ్రస్తుఁడై పల్కెను. అంత నాబ్రాహ్మణుఁడు "ప్రభూ! కొంచెములుగఁ గనపడు కోర్కెలె యెట్లు పరిణమిల్లునో గాంచితిరా? మీ చెలికాండ్ర ముఖ స్తుతులకు మురిసిపోయి వారు కోరిన దంతయు ననుగ్ర హించుటచే దుదకు మీ రాజ్య మెట్లగునో యూహింపుఁడు. మీ కది యెఱింగించుటకే నే నీ బహుమతిఁ గోరితిని. కాని నా కది వలదు" అని చెప్పెను. రాజు మిగుల నానందించెను. అవివేకులును, ధూర్తులు నగు వారి నందఱఁ బారఁద్రోలెను. వారి కొసగుచుండిన వేతనములఁ నియ్యక జాలించెను. సన్న సచివుఁ డాయెను. నాఁటినుండియు వంగరాజ్యము గడు సమ ర్థతతోను, నిపుణతతోను, దుర్వ్యయములు లేకఁ జక్కగఁ బరిపాలింపఁబడుచుండెను.

## 34. అచంచల విశ్వాసము

పుండరీకుఁడు మహానీయుఁడు. మహావిష్ణుభక్తుఁడు. శ్రీమహా విష్ణువు క్షీరవారాశి మధ్యమున యోగనిద్రావిలాసియైయుండు నని వినెను. దేవుని ముఖాముఖి గాంచఁగోరెను. ఆకసము

నందలి క్షీరపథమును, పృథ్విపైని పాక్ జలసంధియుక్షీరసముద్ర రూపములని జెప్పఁబడుటచే నాకసమునందలి క్షీరపథమున నా పరంధాముని వెదకుట దుస్సాధ్య మనియు, పాక్ జలసంధి యందే వెదక నుద్దేశించెను. అందుఁ జని యరుణోదయమునకుఁ బూర్వమే స్నాన మొనర్చి, ప్రాతస్సంధ్యావందన మాచరించెను. నారాయణుఁడా సముద్రమధ్యమున నిదురించుచున్నటుల మన సార విశ్వసించి యందలి నీటినిఁ దన రాగిపాత్రచేఁ దోడి బయటఁబోయఁ బూనుకొనెను. దినమంతయు విసుగు విరామ ములు లేక దోడిపోసెను. ఎండయని వెనుకాడలేదు. సముద్ర జలములను ముంచిపోయుట మానవశక్తికతీతమని భీతిఁ జెంద లేదు. బయటఁబోసిన నీరంతయు మఱల నా యిసుకలో నింకి యంతర్వాహినియై జలరాశిఁజేరుచున్నటు లేమాత్రమనుకొన లేదు అచంచల సంకల్పముతోఁ దనపనినిఁ జేయుచుండెను.

ఇనుఁడపరాద్రి గ్రుంకెను. విష్ణువు భక్తుని దృఢసంకల్పము నెఱింగి బ్రాహ్మణవేషమున నాతనికడ కేగెను. "ఈ చేయు చున్న కార్యమేమి" యని పుండరీకు నడిగెను. అతఁడు తన నిశ్చితమును వెల్లడించిన వెనుక, "ఎంత మందబుద్ధివయ్యా! కల్పాంతమువఱకిటుల నీ రాగిపాత్రచే ముంచిపోసినను సము ద్రోదకమును బయటికిఁ దోడఁగలవా? అదిగో చూడుము! నీవు తోడిన నీరెల్ల మరల యెటుల నా వార్ధినే జేరుచున్నదో. ఇట్టి విపరీతప్రయత్నము లేల? పొమ్ము. ఇంటికిఁబోయి హాయిగ భుజింపుము" అని హితోపదేశ మొనర్చెను. పుండరీకుఁడప్పలు కులు విని, "సోదరా! నీవు నాకు సాయమొనర్ప నిచ్ఛ

గించుచో నీవు నొక పాత్రనుం గైకొనుము. నీవు తోడుము. లేకున్న నన్ను వదలి వెళ్ళుము. ఈప్సితార్థప్రాప్తి యగువఱ కును నే నొక్కడనే తలపెట్టిన కార్యమునుం జేయుచుందును. ఆరంభించి పరిత్యజించు వాఁడను గాను సుమా! యని నుడి వెను. ఆ విప్రుం డున్నదియుఁ బోయినదియుఁ గూడ గమనింపక పుండరీకుఁడు తన కార్యమును జేసికొనుచునే యుండెను. భగవంతుఁ డా పుణ్యపురుషుని దృఢసంకల్పమున కెంత మెచ్చి యెదుట సాక్షాత్కరించి "నీ వంటివారే నా వారు. అచంచల విశ్వాసమే శైలముల బెకలించఁగలదు. మహాసముద్రముల నెండింపఁగలదు. స్వర్గమునకు నిచ్చెనను సృష్టింపగల" దని నుడివి యాతని ననుగ్రహించెను.

## 35. మత స్వాతంత్ర్యము

విక్రముఁడు వీరశైవుండు. చోళభూపతి. రామానుజ మతస్థులు, వైష్ణవులు, కొందఱు శివునికంటెను విష్ణువే యధికుఁడని నిర్ధారణ మొనర్చి ప్రచారముఁ జేయుచున్నటుల వినెను. కడు కుపితుఁ డయ్యెను. దానిని ఖండింపఁదలఁచెను. వారిని దండింప నెంచెను. "శివుఁడే యాదిమధ్యాంతరహితుఁడు. శివుఁడే సర్వాతీతుఁడు" అని యొక గొప్ప పుస్తకమును వ్రాసెను. వైష్ణవుల నెల్ల బిలిపించి కాల్పించెద ననియు, గను గ్రుడ్లూడబెరికించెదననియు భయపెట్టి తన సూత్రములకు సమ్మతించినటుల నా పొత్తమున సంతకములుఁ జేయ నిర్బంధించెను.

ఆ వచ్చినవారిలో నొక గొప్ప యాళ్వా రుండెను. రా జాతని వందు సంతకముఁజేయ నాజ్ఞాపించినంతనే, "అయ్యా! ఈ గ్రంథ మాకల్పాంత ముండునా?" యని ప్రశ్నించెను. "ఉండదు. ఎంతో భద్రముగఁ గాపాడినచో రెండు మూడు శతాబ్దములవఱ కుండగలదు" అని రాజు ప్రత్యుత్తర మొసఁగెను. అంత నయ్యాళ్వారు, "ప్రభూ! శివుఁడు శాశ్వతుఁడు గదా! ఇట్టి యశాశ్వత వస్తుమూలమున నా మహామహుని యౌన్నత్యమును బ్రకటించుట భావ్యమా?" యని యడిగెను. రాజా యుచిత ఖండనమున కంగీకరించి నాటనుండియుఁ దన సూత్రములకుఁ వ్యతిరేకులను హింసించుట మానుకొనెను. అందఱికిని మత స్వాతంత్ర్య మొసఁగెను.

## 36. మూఢ నమ్మకము

గౌతమబుద్ధుని యనంతరము కాశ్యపబుద్ధుఁడు పీఠాధిపతి యయ్యెను. దక్కనులోని పారణ మత మాతని కొసఁగఁ బడెను. అది మైదంతస్థుల సౌధము. ఒక పెద్ద రాతిగుండు నుండియే యా మైదంతస్థులును నిర్మింపఁబడినవి.

వాటియందు వరుసగ మొదటిదానియం దైదు వందలు, రెండవదానియందు నాల్గువందలు, మూఁడవ దానియందు మూఁడువందలు, నాల్గవ దానియందు రెండువందలు, నైదవ దానియందు వందయు గదులు నిర్మింపఁబడినవి. పై యంతస్థునఁ బుట్టిన యూటనుండి ప్రతిగదికినిఁ గాలువల మూలమున నీరు సరఫరాఁ జేయఁబడుచుండెను. చెంత వ్యవసాయపు భూములే లేకుండెను. నాగరిక గ్రామ మెద్దియు నా చేరువనఁ

గాన్పింపకుండెను. సుమారు రేడుమైళ్ళ దూరమున భిల్లులపల్లె మాత్ర మొకటి యుండెను. అదియే యాప్రాంతమునకు గొప్ప పట్టనము. చెట్టులేనిచోట యాముదపుచెట్టే మహావృక్షముం గాదా!

బౌద్ధ భిక్షుకు లా మఠములోని కెగిరిపోవుదురని యా భిల్లు లెల్లరు గట్టిగ నమ్మియుండిరి. చైనా దేశపు యాత్రికులు కొంద ఱా మఠమునకు నడచిపోవుటం గాంచిరి. "మీ రేల యెగిరిపోకూడదు?" అని వారి నడిగిరి' "మేమీ మతమును గ్రొత్తగ నవలంబించితిమి. మా కింకను రెక్కలు రాలే"దని వా రుచిత విధమున జవా బొసంగిరి.

## 47. నిగ్రహము

జైన దిగంబరుం డొకండహమ్మదాబాదు నగరమున ననేక వేల స్త్రీపురుషుల మధ్యం గూర్చుని యుండెను. క్రైస్తవ మతబోధకుం డొక యమెరికను వానిం గాంచి మిక్కిలి యాగ్రహమున "నీకు లజ్జ లేదా?" యని యడిగెను. "ఎందులకు?" అని జైన సన్న్యాసి యడిగెను. "వస్త్రవిహీనుండవై యింద ఱాడువారినడుమం గూర్చొనుటకు?" అని యమెరికను అని యెను. "ఇందు దప్పేమి?" నీ ముక్కునుం గప్పిపుచ్చు కొనక తిరుగుచుందు వేల?" యని యా పరివ్రాజకుం డడిగెను. "నా ముక్కెవరికిని హానిం జేయదు!" అని యా దొర యనెను. "సరియే, నా యవయవము లెవ్వియుంగూడ నితరుల కపకార మొనర్పవు. నీవు నీముక్కును మాత్రమే జయింపంగల్గితివి.

నే నన్ని యింద్రియములనుఁ గూడ నిగ్రహించితిని” అని యా దిగంబరుడు ప్రత్యుత్తర మొసఁగెను. అమెరికా వాఁడు మాటాడక వెడలిపోయెను.

## 38. భాగ్యరేఖ

ఆ బ్రాహ్మణుఁడు మిగుల గొప్పజ్యోతిష్కుఁడని ప్రతీతి. పేరు నలుదిక్కుల మాఱుమ్రోగుచుండెను. క్రమముగ రాజువరకు గూడఁ బ్రాకెను. ప్రభు వాతనిఁ బరీక్షింప నెంచెను. ఒకనాటి సాయంకాలమున నాస్థానమునకు రప్పించెను. మూఁడు పిల్లి చూపు రవలను చేతఁబట్టుకొని “నాచేత నున్న దేమి ?” యని యడిగెను. ఏమి చెప్పుటకునుఁ దోఁచక నా ద్విజుఁడు మీన మేషము లెంచుకొనుచుఁ గూర్చుండెను. చెప్పునది తప్పైనచో నా ధర్మప్రభువుకడ నాస్థానజ్యోతిష్కుఁ డగు నవకాశము జారిపోవును. అంతియేగాక దానన్నిదినములుగ గడించిన పేరుఁ బాడగును” అని కళవళపడుచు దిక్కులుఁ జూచుచుండెను. ఇట్లుండ నా సభాస్థలి నొక చీకటిమూల మార్జాల మొకటి కూర్చుండి తనవైపుఁ జూచుచుండెను. ఆ మూల యందలి తళతళలం గాంచి “పిల్లిచూపులా” యని గొణఁగుకొనెను. అత్యుత్సాహభరితుఁడై, యావిప్రుఁ డేమి నుడువునో యని గనిపెట్టుకొని యున్న యా భూవరుఁ డా మాటలు వినుచునే “అవు నవు” నని యఱచి “ఎన్ని ?” యని మఱల బ్రశ్నించెను. భాగ్యరేఖ ప్రభవించెఁగదా యని యా పాఱుఁ డత్యంతానందముం బొందెను. ప్రథమఫలితము ప్రయోజనకారి యగుట సంతసించుటకు బదులు మఱల నేమి చెప్ప

వలయునో తోఁచక యటు నిటు జూచుచుండ, సమీపము నందలి యాలయమున మూఁడుమార్లు శంఖనాద మొనర్పఁబడెను. జ్యోతిష్కుఁడు "మూఁడు" అని గొణుగుకొనెను. "అవు నవు" నని యా తేఁడు మఱల నఱచెను. బ్రాహ్మణుని జోస్యమున కాశ్చర్యపడుచు మిగుల సంతసించి యాతనిఁ దన యాస్థానజ్యోతిష్కునిగ నియమించెను. నాటినుండియు వారిరువురును క్షీరనీరన్యాయమున నొకటియై యొకరిని విడిచి యొకరుండ లేకుండిరి.

కార్తాంతికుఁ డది యంతయు నదృష్టఫలమే యని యెంచి నాటినుండియు "ఇవి అన్నియు మన మంచి కొఱకే" యని ప్రతిదానికిని నుడువుచుండెను. రాజకీయోద్యోగమునఁ బ్రవేశించి యొకయేడుఁ గడచెను. రా జొకనాఁడు మృగయావిహారార్థ మేగుటకై తన కరవాలమును శుభ్ర పఱచుకొనుచుండ జూపుడుఁవ్రేలి కొన తెగెను. మొండి వ్రేలయ్యెను. నెత్తురు వరదలై పార, బాధచేఁ పలవించుచుఁ దన కాలజ్ఞునికుం జూపెను. "ఇదియు మన మంచికొఱకే" యని యా విప్రుఁడు వెంటనే యనెను. ఆ యసంబద్ధపు సమాధానమునకు రాజు కడుఁగోపగించి యాతని నుద్యోగమునుండి బర్తరఫొనర్చి "వెళ్ళుము. ఇందుండి లేచివెళ్లుము. నీ ముఖమునుఁ జూపకుము" అని తరిమివేసెను. ఆ బ్రాహ్మణుఁ డందుండి లేచిపోవుచు "ఇదియు మన మంచికొఱకే" యనుచు వెళ్ళెను. ఆతని శాంతమునకును, మనస్థైర్యమునకును రా జచ్చెరువు నొందెను.

సాయంకాలమున నా భూపతి తన పరిజనులతోడ నడవి కరిగెను. వేట తమకంబున భృత్యులందరికంటెను కడుదవ్వరిగి యొకమహారణ్యమధ్యమునఁ దగుల్కొనెను. గొంతెండిపోవుటచే నీటికై వెదకఁజొచ్చెను. 'బావిఁద్రవ్వఁబోవభూతము బయటఁబడిన' దనినట్లు నీటికై వెదకుచుండ నిశితకరవాలములనుఁ జేతఁబూని, భయంకరారావము లొనర్చుచు భయంకరాకారులు గొందఱాతనిఁ జుట్టుముట్టిరి. ఒంటిమైనుండుటచే రాజేమియుఁ జేయ లేక వారికిఁ బట్టువడెను. రాజగుటచే, దగినవాఁడని యెంచి, కాళికాదేవికి బలియిచ్చుట కాతనిం బంధించి కొంపోయిరి. ఆటవిక నాయకుఁడును "ఇది యంబప్రసాదమే! అయిన నీతని పరీక్షింపుఁడు. బలియియ్యఁబడువాని కెట్టియంగ వైకల్య ముండరాదు. అట్లుండిన నంబ కోపించును" అని తన యనుచరులకుం జెప్ప, వారు వెంటనే యాతని యవయవముల నెల్లఁ బరిశీలించిరి. మొండి వ్రేలునుఁగాంచి "బలికిఁదగ" దని నుడివి వదలివేసిరి.

పులి నాకి విడువఁబడిన వానివలె నా రాజా మత్తోన్మత్తుల నుండి దైవానుగ్రహమునఁ దప్పించుకొంటిఁగదా యని యమందానందకందళితహృదయుఁడై తన పరిజనులంగలిసికొనియింటికేగెను. మఱునాఁడా దైవజ్ఞుని రావించి, "ఆర్యా! నా కృతఘ్నతను మన్నింపుఁడు. వ్రేలు దెగుట క్షేమకరమైనది. లేకున్న నీపాటికా రాక్షసులచేఁ గాళికాదేవి కాహుతినైయుండెడివాఁడనే. మిమ్మవమానించి తరిమి వేసినపుడు ఇదియు

మన మంచికొఱకే' అని నుడివితిరి. దాని యర్థ మేమో ఎఱింగింపు"డని యడిగెను.

"ప్రభువరా! అది మీ కింకనుఁ దెలియలేదా? మీరెందేగి నను నన్ను మీ వెంటఁ గొనిపోవుచుంటిరిగదా! నన్ను తరిమి వేయకుండినచో నిన్న నేనును మిమ్ము వెంబడించి యుండెడి వాఁడనేగదా. అప్పుడు నాగతి యేమైయుండెడిది? బ్రాహ్మణుఁడనై యెట్టి యంగవైకల్యమును లేకుండినందున నన్నా యాటవికులు వదలియుందురా? కావున జరిగినదెల్ల నాకు శ్రేయస్కరమే యైనదిగదా" యనియాకాలజ్ఞుఁడు నుడివెను.

రాజు నవ్వుచు నా బ్రాహ్మణున కనేక బహుమతుల నొసఁగి, మునుపటి యుద్యోగమునిచ్చి ప్రేమించి గౌరవించెను.

## 39. అసూయా ఫలితము

ఒక గ్రామమున నొక పరివ్రాజకుఁ డుండెను. అతఁడొక మహాయోగి, దివ్యపురుషుఁడు. మానవోద్ధరణమే మతోద్ధరణ మనియు, మాధవసేవ యనియు విశ్వసించి, జీవితము నందులకై ధారవోయ సంకల్పించి కంకణముఁ గట్టుకొనెను. అచిర కాలముననే యాతని ప్రఖ్యాతి యెల్లయెడల వ్యాపించెను. ప్రజ లెల్లరు నతఁడు పరమాత్ముని యవతారమని పూజింప సాగిరి.

కాని లోకము అసూయ కాటపట్టు. ద్వేషమున కావాసము. అట్టి మహనీయునకును శత్రువులుండిరి. శత్రుత్వము ధన మూలముననుగాదు. విరుద్ధ మత సిద్ధాంతముల వలనఁ గాదు.

శత్రుత్వమున కాయన యౌన్నత్యమే ముఖ్యకారణమాయెను. కొందరు నృశంసు లొక కూటముగ నేర్పడిరి. ఆయన యధః పతనమే తమ యానందమని తీర్మానించిరి. దుష్ప్రచారము లను సలిపి యాయనకు శృంగభంగ మొనర్చుటయే తన శౌర్యమని భావించిరి. లోలోనఁ గుట్రలుఁ బన్నసాగిరి.

పిచ్చు అను నొక పేదముూతివానిం బట్టుకొనిరి. వానికి వక్షము ముందునకును, పిఱుదులు వెనుకకును వంగియుండెను. స్త్రీ వేషమున కన్నివిధములఁదగియుండెను. వానికి వేషము వేసి, "ఈమె గర్భవతి. దీని కాసన్యాసియే కారణము. కామినీకాంచ నములను వర్జించితినని డంబములుగొట్టునే గాని ఈమె నాయ నయే చెఱచెను. ఇట్టి గోముఖవ్యాఘ్రములను, మేకవన్నె పులు లను నమ్మవలదు." అని వానిని వెంటగొని దుష్ట ప్రచారము సల్ప మొదలిడిరి. చూచువారలకు నమ్మకము గల్గునటుల ఒక మెత్తని పట్టుమూట వాని పొట్టకుఁ గట్టిరి. ఆ మూటను నానాటి కెక్కువజేయుచు గర్భము వృద్ధిబొందుచున్నటుల జూపించుచుండిరి. ఈ పన్నుగడ తమ కూటములోనివారికిఁదప్ప నితరుల కెవ్వరికిని దెలియకుండ మిక్కిలి జాగ్రత్త వహించు చుండిరి. కాని దేవుఁడు లేడా ? సత్యము జయింపదా ?

పిచ్చు దొక కుగ్రామము. అటవీ ప్రాంతము. గ్రామవాసులు కూపస్థ మండూకములు. పిచ్చు తన గ్రామమున నున్నప్పు డంతయుఁ బురుషవేషముననే యుండెడివాఁడు. కాని గర్భ నిదర్శనములనుమాత్రము తీసివేయకుండెను. తన దౌష్ట్యమును తుదకుఁ తన భార్యకుఁగూడ నెఱిఁగింపకుండెను. 'స్త్రీలనోట

మాట నిలువ'దను తన మిత్రుల వాక్యములను గట్టిగ నమ్మెను. తాను కృతార్థుఁ డగువఱకును తనభార్యను గూఁడ ముట్టుట మానుకొనెను. కడుపు నానాటికి ముందునకు త్రోసి కొనివచ్చుటకుఁ గారణ మేమని తనకాంత యెన్నియోసార్లు గుచ్చిగుచ్చి యడిగెను. పాప మా యమాయకురాలికిఁ దన భర్తచేష్ట లెవ్వియుఁ దెలియకుండెను. తుద కొకనాఁడు తన భర్త గర్భవృద్ధికిఁ గారణ మఱియు గట్టిగ బట్టు బట్టెను. ఇతరుల కెవ్వరికిని బయలుపరుపనని యామెచే గట్టిగ నొట్టుఁ బెట్టించుకొని విధిలేక " ప్రేయసీ! నేను గర్భము ధరించితి" నని దెలిపెను. విస్మయభరితయై, ఏమీ! పురుషుల కెట్లు గర్భము గల్గును? ఇన్నియేండ్లుగ మీరు నాకు భర్తలై యుండియు నాకుమాత్ర మేల........" అని యమ్మగువ యడిగెను. "అయ్యో! దాని కిదియే కారణము. నీ వెఱుఁగవా? దంపతులలో నెవరికైన నొకరికే గర్భము వచ్చును. ఒకరు గర్భమును ధరించినచో మఱియొకరికి రానేరదు. కాని యిది సృష్టికి విరుద్ధము. నాకు గర్భముగల్గెనని మఱియెవరి కినిఁ దెలుపరాదుసుమా! నీవేదో నాయిల్లాలివని నుడివితిని. జాగ్రత్త!" యని నుడివెను.

ఈ విపరీత వృత్తాంత మామె మనస్సు ననుక్షణము కలచి వైచుచుండె. ఊరిబావికడకు నీరు దెచ్చుకొనుటకుఁ బోయి నపుడెల్ల నీవిషయమునుమనస్సునకుఁ దెచ్చుకొనుచు ముసిముసి నవ్వులు నవ్వుకొనుచుండెను. ఆడువారెల్లరు నామె నవ్వునకుఁ గారణముఁ దెలుపుమని బలవంతపరిచిరి. మొదట నెవ్వరికిని

యారహస్యమునుఁ దెలుప నిరాకరించెను. కాని, తన యా ప్త్రరాలికిమాత్ర మామెచే నితరుల కెవ్వరికిని దెలియనీయ నని పెద్ద యొట్టుఁబెట్టించుకొని "నా పెనిమిటి నీమధ్య గమనించితివా?" యని యడిగెను. "అవును. పొట్ట మాత్రము బలియుచున్నది. ఒకవేళ నది యెక్కువగ మెక్కుటచేఁ గల్గి యుండునేమో! లేదా, గుల్మవ్యాధి యేమైనఁ గల్గినదేమో! ఇంతదప్ప నీ భర్తయందు మఱేమియు గమనింపనైతిని" అని యా మిత్రురా లనియెను. "అది భోజనము వలనఁగాదు" యని యామె నవ్వఁజొచ్చెను. "అయిన నది యేమి?" యని యా మిత్రురా లడుగ "నాకు బిడ్డలు లేరు. మావారికి మాత్రము శీఘ్రముగనే బిడ్డపుట్టును" అని పిచ్చిభార్య నుడువగనే "ఏమీ!" యని యా మిత్రురా లపరిమితాశ్చర్యభరితయై చంకన బెట్టుకొనియున్న నీటికుండ జారిపడిపోయినను దెలిసికొనక "ఇదినిజమేనా! నేను నమ్మజాలను" అని యనుచు ముక్కుపై వ్రేలిడుకొనెను. "కాదమ్మా! నేనును దొలుతఁ గనుఁగొనలేదు. వారే చెప్పిరి" అని యామె యన, నా మిత్రురాలు, "ఆయనయేఁ జెప్పెనా!" యని యచ్చెరువొందెను. "అవునమ్మా! కాని మీరు మాత్ర మెవ్వరితోడనుఁజెప్పకుఁడు. ఇది కడురహస్యమైనవిషయము" అనుచు పిచ్చిభార్య యింటికి వెళ్ళెను.

ఇతరుల కెవ్వరికినిఁ బయలుపరుపనని గట్టిగ నొట్టుఁబెట్టించుకొనుచు నామె తనమిత్రురాలికిఁ జెప్ప, నామె యామె నెచ్చెలికిఁ జెప్ప, నిట్లే యా యూరి యాడువారెల్లరకునుఁ దెలిసి

పోయెను. కొంద ఱాశ్చర్యమును దాపలేక తమ భర్తలచే నొట్టు బెట్టించుకొని తెలిపిరి. వారును నట్టి ప్రకృతి విరుద్ధ విషయమును దాచలేకఁ దమతమ మిత్రులచే నొట్టుఁబెట్టించుకొని యెఱుకపరచిరి. ఇటులనే యవ్వార్త కడ కా సన్న్యాసి శిష్యులలో నొకనికిఁ దెలిసిపోయెను.

పిచ్చుమాత్రము తనకును, తన భార్యకును దప్ప మఱి యెవ్వారికినిఁ దనవృత్తాంతము తెలియదని నమ్మి యెట్టిసంశయ మును లేక యొకనాఁ డా పరివ్రాజకుఁడు ప్రచారమున కేగిన యొక మహానగరమునకుఁ వెళ్ళెను. స్త్రీ వేషమును ధరించుటచేఁ బురుషుఁ డని యెవ్వరికిని ననుమానపడ నాస్పదము లేకుండెను. ఆ యోగిపుంగవుఁడు నిండుసభలో గంభీరముగ నుపన్యసించు నెడ నాయన చెంత కేగి "నన్నుఁ జెఱచితివి. నీవలన నా కీగర్భముఁ గల్గెను. కావున నాకును గర్భమునందలి యీ శిశువునకును భరణమిచ్చెదవా, లేదా?" యనియడిగెను. తన కా విషయములతో నెట్టి సంబంధమును లేదని యా మహనీయుఁడు జెప్పుకొనుచుండినను వినువారెవ్వరు? లోకులు పలుగాకులుగదా! అబద్ధము రుచించినటుల సత్యము రుచించునా? సభలోని వారిలో రెండు కక్షలేర్పడియెను. ఒకటి యాయన పక్షము. రెండవది యా మాయావనితవైపు. గొప్ప గందరగోళమాయెను. తీవ్రముగ వాదోపవాదములు జరుగుచుండ, నా మాయావనిత మర్మమెఱిఁగిన శిష్యుఁడు ధైర్యముతో ముందున కేగి చీరయడుగునఁ బొట్టపైనిఁ గట్టబడియున్న పట్టు మూటను లాగివైచెను. " ఈ కడుపు గర్భధారణము వలనఁ

గాదు, పట్టుమాటవలనఁ గల్గినది. అంతియేగాదు. ఈమె స్త్రీయని భ్రమింపకుఁడు. మన పిచ్చి” అని నుడివి సభలోని వారి యనుమానమునుఁబోఁగొట్టెను. సన్న్యాసి గౌరవధర్మము జయించెను. ఊరివారెల్ల పిచ్చినకుఁ దల గొరిగించి గాడిదపైఁ దోక వైపున మోమునుండునటులఁ గూర్చుండబెట్టి నగరమున నూరేగించిరి.

## 40. వాతాపి నిర్యాణము

లోపాముద్ర బీరారురాజున కేకైక తనయ. గారాబుపట్టి. అందములప్రోవు. సుగుణంపురాశి. సత్త్వవర్తన కామె దే పెట్టిన పేరు. శుక్లపక్షచంద్రరేఖనుం బోలి దిన దిన ప్రవర్ధమానయయ్యెను. క్రమముగ బెండ్లియీడు వచ్చెను.

ఒకనాఁడగస్త్యుఁడు రాజుకడ కరుదెంచెను. తన కా చిన్న కన్నె నిచ్చి పాణిగ్రహణమొనర్పఁ గోరెను. కాని యా ప్రభువునకుఁగాని, యాయన రాణికిఁగాని తమ ముద్దులపట్టిని, అందంపు రాశిని యా ఋషికిఁ ఆ నిరుపేద కిచ్చి వివాహముఁ జేయ నెంతమాత్ర మిష్టము లేకుండెను. ఇచ్చి చేసినచో కాకి ముక్కునకు దొండపండువలె నుండు నని భావించిరి. కాని నిరాకరించిన నా మునీశ్వరుఁ డెక్కడ శపించునో యని భయపడసాగిరి. లోపాముద్ర యమ్మౌని మహిమను విని యుండినందున జననీజనకుల కడ కరిగి, “నాకొఱకై మీరు వగవకుఁడు. మీరు సమ్మతించి నన్నాయనకే యొసఁగి వివాహము గావింపుఁ”డని ప్రార్థించెను.

కుందనంపు సొమ్ములను, కడాని వలువలను లోపాముద్ర కొసఁగి మహావైభవమున వివాహముఁ గావించిరి. పెండ్లియైనది. అగస్త్యుఁడామెతో, "నేను పేదవాఁడను. అటవియే నా యావాసము. నీవును పేదవాని భార్యవలెనే ఉండవలయును. మనకీ యాడంబరము లేల ?" యని జెప్పుచుండగనే యా సుశీల మాఱుమాటాడక స్వర్ణభూషణచయంలను, విలువగల వలువలను దీసివైచి నిఱుపేదయువతి మాడ్కి నల్లగాజులును, నాటుచీరయు ధరించి భర్తవెంటఁ బయనమాయెను.

అగస్త్యుఁడు గంగానదీతీరమున కరిగి తపముఁజేయ నారంభించెను. మిక్కిలిపతిభక్తితో లోపాముద్రయునాయనకు సేవలఁజేయుచుండెను. తపము పూర్తియైనవెనుక నవ్వాని లోపాముద్రవలన నొకపుత్రునిఁ బడయ నెంచెను. అంత లోపాముద్ర, "మనోహరా! నా తండ్రి గేహమున నుండినపుడు నే ధరించుచుండిన భూషణాంబరములవంటి మేల్మి సొమ్ములను, దుకూల వస్త్రములను ధరింప గుతూహలము జనించుచున్నది. తమకు వీలైనచోఁ దెచ్చియిచ్చిన బాగుండు" నని యడిగెను.

వెంటనే తనవనిత కౌతుకమునీడేర్ప నెంచియాభట్టారకుఁడు మిగుల ధనికుఁడని పేర్గాంచిన స్రుతర్వాణుఁ డను భూవరుని కడకేగి కొంత ధనమిమ్మని వేడెను. ఆరాజు తన యాయవ్యయములం జూపి తన కెక్కువగ ధనము మిగులదనియు, మిగిలిన కొంచెమునుఁ దన సొంతమునకుఁ గావలసి యుండుననియు నుడివెను. ఆయనకంటెను ధనవంతుఁడని ఖ్యాతిఁగాంచిన బ్రదనాశ్వుఁడను ప్రభువుకడకు వారిరువురు నేగిరి. ఆయనయుఁ దన

కేమియు మిగులదని చెప్పుటచే వారు మువ్వురును గలసి త్రస దస్యుని కడకుం జనిరి. వారిరువురికంటెను నీయనయే భాగ్య వంతుఁడని ప్రసిద్ధి. కాని యాయనయు దన కేమియు మిగులదని లెక్కలుఁజూపించెను. ఇతరులు తమకై దాచుకొనినదానినితన కిమ్మని యగస్త్యుఁడడుగుట కిష్టపడకుండెను. అందుచే నల్వు రును గలసి కుబేరుని మించినవారని పేరుబొందిన వాతా పీల్వలు లను రాక్షస సోదరుల కడ కేగిరి.

దురాశాపరుని యూహాలను మించినధన రాసులు యిల్వలు నకుం గలవని ప్రతీతి. కాని యా యసురసోదరులు తమ యతి థుల నొక చిత్రగతి భక్షించుచుందు రను పేరు నలుదిక్కుల నలుముకొని యుండెను.

"వాతాపి యజరూపుఁడగును. ఇల్వలుండు దానిం జంపి వండి యతిథులకుఁబెట్టును. భోక్తలా వంటకమును భుజించిన పిదప నిల్వలుఁడు 'వాతాపి! వాతాపి!' యని పిలుచును. వెంటనే యయ్యతిథుల కుక్షులం జీల్చుకొని వాతాపి బయటఁ బడును. మరణించిన యతిథుల నిరువు రన్న దమ్ములునుఁ గలసి వండుకొని హాయిగా భక్షించుచుందురు. ఇవ్విధమున ఋషు లెందఱో వారి కుక్షింబడిరి" అని యా ప్రభుత్రయ మా మునీ శ్వరున కెఱిఁగించిరి. ఆ దనుజులకడ కరుగవలదని హెచ్చరించిరి. కాని "యెట్టి రక్కసులనైన జీర్ణించుకొనఁగల జఠరాగ్ని నాయందుఁ గలదు. దిగులొందకుఁడు. నావెంట రండు" అని యా మునితిలకుఁడు వారికి ధైర్యముఁజెప్పి వారి నా యసురుల కడకుం గొంపోయెను.

ఆ నలువురఁగాంచి తమపంట పండెనని యిల్వలుఁ డానంద పడెను. ప్రేమ యుట్టిపడునటుల నటించుచు వారి కఖండ స్వాగత మొసఁగెను. తన యాతిథ్యమును స్వీకరించుచో నొక్కొక్కరికిని లక్షరూప్యములను, పెక్కు చీనిచీనాంబరములను, లెక్కకు మిక్కుటమగు దివ్య మణిరత్నఖచిత భూషణముల నొసఁగెదనని నుడివెను. యథాప్రకారముగనే వాతాపి యజరూపుఁడాయెను. ఇల్వలుఁడు వానిం జంపి వండెను.

ముందుగనే వారు నల్వురును మాటాడుకొనిన విధమున వాతాపిమాంస మంతయు నగస్త్యునకేయిడిరి. అమ్మౌని దాని నంతయు భక్షించి త్రేఁపెను. ఇల్వలుఁడు ఋషి మందబుద్ధియని యెంచి, లోలోన నవ్వుకొనుచు నలువురి మాంసము లభింపఁ గలదని యానందించుచుండెను. యథారీతిగా 'వాతాపీ! వాతాపీ!' యని పిలచెను. కాని వాతాపి రాలేదు. అగస్త్యుఁడు మఱల త్రేఁపి వికావిక నవ్వుచు, "ఇల్వలా, అబ్బాయీ! ఇంకెక్కడ వాతాపి. వాతాపిలో మిగిలినది యాకొంచమే. అట్టి వాతాపులను పదిమందిని జీర్ణించుకొనుశక్తినాకుఁగలదు" అనియెను. ఇల్వలుఁడు భయకంపితుఁ డాయెను. తానైనను బ్రతుకఁగల్గుదునా యని వెఱగొందసాగెను. ఒక్కొక్కరికినిఁ బదిలక్షల రూప్యములు, యగణితములగు నవరత్నఖచిత దివ్యాభరణములు, కడాని వలువలు నిచ్చి పంపెను. విజయముతో నగస్త్యుఁ డింటికేగి వానినెల్ల లోపాముద్ర కొసఁగి కామ్యసుఖములం బొందెను.

## 41. లంబోదరుని మహిమ

"పిపీలికాదిబ్రహ్మపర్యంత మన్ని జీవ జంతువులయందును మనము నిండి నిబిడీకృతులమై యున్నారము. ప్రతిజీవి రూపమును బొంది సుఖింతము, ఆనందింత" మని శివుడు పార్వతి నడిగెను. వల్లె యని యామె తలయూచెను. ఇరువురును గజరూపులైనపుడు పార్వతికి గర్భచిహ్నము లగుపడెను. తన కడుపున నేనుఁగు బుట్టునేమో యని యామె వెఱఁగొందెను. అది యెంతమాత్ర మామె కిష్టముఁ గాకుండెను. అందుఁ దప్పేమియు లేదని యామెను శివుఁ నొప్పింప యత్నించెను. కాని యామె యియ్యకొనకుండెను. అటుల జరుగకుండ నెటులైనఁ దప్పింపుమని పతిని వేడెను. ఎట్టకేల కా జగత్పతి యిట్లనియె: "ప్రియా! నీ యిచ్చవచ్చిన చొప్పున నొనర్తును. కాని నీకుదయింపబోవుతనయుఁడు నరగజరూపుఁడై యుండఁగలఁడు. మేధానిధియై మానవుల కష్టములనెల్ల నిర్మూలించి సౌఖ్యదాయకుఁడై పూజింపఁబడగలఁడు. సురలకుఁ జేఁదోడుగనుండి వారి మన్ననలకుఁ బాత్రుఁడు గాఁగలఁడు."

కొంతకాలమునకుఁ గణేశుఁడుజన్మించెను. గణేశుఁడగుటచే మర్త్యామర్త్యుల కెల్లఱకును మాననీయుఁ డయ్యెను. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముగ్వురుం గలసి తమ్ము బూజించువారెల్లఱును ముందుగా నా గణేశునే బూజింపవలయు నని త్రిలోకము లందును శాసించిరి. తొండము, పెద్ద బొజ్జ, సమయానుకూలపు ఛలోక్తులు, ధర్మవర్తనము, వివేకము, విజ్ఞానము దేవతల మనసుల నాకర్షించెను. గణేశుఁడు

సుమనస్కుఁడు. మృదుమధురాలాపి. ప్రసన్న వదనుఁడు. మూషక వాహనుఁడు. భోజనప్రియుఁడు. ఆయన తమ్ముఁడు సుబ్రహ్మణ్యుఁడు. మానవరూపుఁడు. సుభగుఁడు. కాని కఠిన హృదయుఁడు. నిరంకుశుఁడు. మయూరవాహనుఁడు. శక్తి ధరుఁడు. తానే గణేశుని కంటెను ధీమంతుఁడ నని తలఁచెను. అట్లుండియుఁ దనకంటెను ముందుగ గణేశుని కేల దేవతలు నైత మగ్రతాంబూల మొసఁగుదురో తెలిసికొనఁగోరెను. ఒకనాఁడు జననీజనకుల కడకేగి విజ్ఞానవిశిష్టతయందు తానే గణేశున కన్నను మిన్నయైయుండియు నతనినే యెల్లఱు నేల మేటి యని పరిగణింతు రని ప్రశ్నించెను. అంత నా పురాణ దంపతు లిట్లు లనిరి: "కానిమ్ము, మిమ్మిరువురను బరీక్షింతుము." అని నుడివి గణేశుని రావించి, "మీ యిరువురిలో విశ్వప్రదక్షిణమును బ్రప్రథమమున నొనర్చిన వారికి బహుమానమిత్తు"మనిరి. గణేశుఁడు మందగమనుఁడుగదా యనియు, నందువలన తానే దప్పక జయింపవచ్చుననియు నెంచి మయూరము నెక్కి క్షీరపథమునుండి ప్రారంభించి విశ్వప్రదక్షిణమునకు బయలుదేరెను. త్రుటికాలమైన నెచ్చటను నిలువక ప్రయాణ మొనర్చినను పూర్తిగ జుట్టి బయలు దేరిన స్థలముం జేరునప్పటి కేడేండ్లయ్యెను. కాని గణేశుఁ డటులుఁగాక తన మాతాపితరుల నేడు క్షణములలో ప్రదక్షిణించి బహుమతిఁ బొంది సోదరుని రాకకై యెదురు చూచుచుండెను. సుబ్రహ్మణ్యుఁడు విజయము తనదేయని కడుసంబరమున తల్లిదండ్రులంజేరి తానే జయించితి ననియు, బహుమతి నిమ్మనియు

నడుగుచు మార్గమధ్యమున గణేశుఁ డెచ్చటనుఁ దన్నుఁగలిసి
కొనలే దని పరిహాసముగఁ బల్కెను. గణేశుఁడు నవ్వుచు
ముందు కేగి "ఒకఁడు గానుగనాడి నూనె దీసెను. మఱి
యొకఁడు గానుగమానునకే వేయిమార్లు ప్రదక్షిణముఁ
జేసెను. అటులే నీవును త్రిజగము నేడేండ్లలోఁ జుట్టివచ్చితివి.
ఏడు క్షణములలో నే నీ పురాణదంపతులను, జగదాధారు
లను, ప్రదక్షిణించి బహుమతిఁ బడసితిని. నీ కది చూపు
మనియెదవా?" యనియెను. పొరఁబడితినిగదా యని సుబ్ర
హ్మణ్యుఁడు నాలుకఁ గొఱుకుకొని వెళ్ళెను. దేవేంద్రునికడ
సేనానాయకుఁడుగ నియమింపఁబడెను. ఆ ఇంద్రుని సక్రమ
పరిపాలనమున శాంతిరక్షణమే ఈయన ప్రధానకృత్య
మాయెను. గణేశుఁడు శివలోకమున సర్వగణేశుఁడుగ నియ
మింపఁబడియెను.

కొంతకాలము జరిగెను. రావణుఁడు హిమాలయములపైఁ
గూర్చుని కడుభయంకరముగఁ దపము జేసెను. శివుని మెప్పు
వడసి యొక లింగమునుఁ గైకొనెను. అదియాతని చెంతనున్నంత
కాల మాతఁ డజేయుఁ డగును. దానిని లంకకుఁ గొనిపోవు
లోపల నెచ్చటను నేలపైఁ బెట్టఁగూడదనియు, నటులఁబెట్టి
నచో నది భూమిలో నాటుకొనిపోవుననియు శివుఁడు దానిం
బ్రసాదించునపుడు జెప్పియుండెను. శివుఁ డొసఁగిన వరమునకు
దేవతల గుండియలు ఝల్లు మనెను. వానివలన తమ బ్రదుకు
నకు భంగముఁ దప్పదనియెంచి యందఱు నేకమై యా రక్క
సున కా లింగమును దక్కనీయఁగూడ దనియు, లంకఁజేరు
లోపలనే దానిని మటుమాయ మొనర్పవలయుననియుఁ దీర్మా

నించిరి. అకార్యమునకుం దగినవాఁడు గణేశుఁడే యని నిశ్చయించిరి.

దైన్యవదనములతో గణేశునిచెంత కరిగి, "నీవే మాకు దిక్క"నిరి. వెంటనే గణేశుఁడు పంౙెండేండ్ల బ్రాహ్మణ బాలుఁడై రావణుని వెంటనంటెను. గోకర్ణ ప్రాంతమునకుం బోవునప్పటి కా రక్కసునకు మూత్రవిసర్జనముఁ జేయవలసి వచ్చెను. అత్తటి శివలింగమును చేతనుంచుకొనరాదు. నేలఁ బెట్టరాదు. ఏమి చేయుదమా యని యాలోచించుచు మూత్ర విసర్జన మొనర్చుదనుక తనకెవ్వరైన నందు సాయముఁజేయఁ గలవారుఁ గలరా యని కలయఁజూచెను. చెంతనే యగపడిన బ్రాహ్మణబాలునిం గాంచి యానందించెను. వానినిఁ జెంతకు బిలిచి శివలింగమునుఁ జేతికిచ్చి తాను మూత్రవిసర్జన మొనర్చి వచ్చువఱకును, క్రిందబెట్టకుండ బట్టుకొనియుండు మని బ్రతి మాలెను. ఆ బాలుఁడు వల్లె యని దానిం బుచ్చుకొని "నాకు మిక్కిలి యక్కరపనిగలదు. మూఁడుపర్యాయములుఁ బిలుచు లోపల నీవు రాకుండినచో దీనిని నేలపై బెట్టి పోవుదును." అని నుడివెను. ఏదో కొన్ని నిమిషములలోనే మరల రాఁ గల్గుదునుగదా యనియు, నంతలోపుననే నా వటువెట్టి తుంటరి తనమునుఁ జేయఁడుగదా యనియు నమ్మెను. కాని రావణుఁడు మూత్రవిసర్జన ప్రారంభించుచుండగనే 'రావణా! రావణా! రావణా!' యని మూఁడుమార్లు తొందర తొందరగ నరచి యా రక్కసుఁడు తనచెంతకరుదెంచు లోపుననే నేలపైఁ బెట్టి వెళ్లెను. రావణుఁడు పరుగెత్తిపోవు లోపుననే యా లింగము

భూమిలో నాటుకొనిపోయెను. దానిని పెకలించుట కెంతయో యత్నించెను. గాని విఫలుండాయెను. లింగమును దారవోసి కొనినందున నాతని యజేతకు భంగము గల్గెను. గణేశుని చాకచక్యమునకు దేవత లెల్లరును సంతసించి వేనోళ్ళ స్తుతించిరి.

మఱికొన్ని దినములుఁ గడచెను. శివుఁడు మానవజాతిపై దయఁదలచి యుదారహృదయుఁడై సోమనాథదేవాలయ విగ్రహమును బూజించినవారి కందరకును స్వర్గము కరబదరికమగు నని యనెను. అందుచే భూలోకమునం దన్ని తెఱఁగుల జనులును నా సోమనాథునిఁ బూజించి తండోపతండములుగ స్వర్గమున కేగుచుండిరి. సురలోకమునఁబుణ్యాత్ముల సమ్మర్దన మెక్కువాయెను. స్వర్గేశునకు వారినందఱి నెట్లు సత్కరింపవలయునా యను దిగు లధిక మాయెను. అమరుల కమరిక తగ్గెను. అందుచే వారందరును గూడ విసుఁగుజెందఁజొచ్చిరి. నాకము చిత్రవిచిత్రవ్యక్తులతో నిండి యొక మహానగరపు చేరువంగల గ్రామమువంటి దాయెను. క్షణక్షణమునకును నూతనాగతుల సంఖ్య యధిక మగుచుండెను. ఉండుటకుఁ జోటును, తినుటకుఁ గావలసినంత భోజనము దొరకుట కష్టమాయెను. నరకమే నాకముకంటెను హాయిగొల్పు స్థలమా యని యనిపించెను. దేవత లందఱునుఁ గలసి తమ సౌఖ్యముల కంతరాయము వాటిల్లెనే యని విలపించుచు రక్షింపుఁ డని గణేశుని కడ కరిగి ప్రార్థించిరి. పుణ్యజనులరాక నడ్డువెట్టి వారిని రక్షింతు నని గణపతి యభయ మొసఁగెను. వెంటనే సోమనాథ దేవాలయముకడ కరిగి గణపతి యొకచో నుపవిష్టుఁడాయెను. స్వర్గా

రోహణ మపేక్షించి సోమనాథునిఁ బూజింప నాలయమున కేగు వారినెల్లఁ బిలచి "సోదరులారా! మీరందఱెం దేగెద" రని యడిగెను. "సోమనాథునిం బూజించి స్వర్గసుఖములం బడయుట" కని వారుఁజెప్పఁగనే "ఛీ ఛీ! బ్రతికియుండఁగ నేమియు లేక యెప్పుడో చచ్చిన వెనుక మీ కేదియో త్రవ్వి తలకెత్తుదు రనుటలో లాభ మేమి? నన్నుఁ బూజింపుఁడు. మీవాంఛితముల నెల్ల నిహలోకమున నేదీర్పఁగలను. హాయిగ సుఖింపుఁడు" అని ప్రబోధమొనర్చుచు నొక పెద్ద మనుష్యునిం బిలచి, "అయ్యా! నీ కేమి గావలయును?" అని యడిగెను. "నా కేమి గావలయునందురా! తినుటకుఁ దిండియు, నుండుటకుఁ గొంపయుఁ దప్ప నా కీ భారతభూమియందు దేనికినిఁ దక్కువ లేదు. అందుకొఱకే నేను స్వర్గమున కైనన్నుఁ బోయిన బాగుండు ననిఁ దలఁచితిని" అనియెను. వెంటనే గణేశుఁ డతని కొక దివ్యహర్మ్యమును అంగరంగ వైభవములనుఁ బ్రసాదించెను. లంబోదర దేవునకు సాష్టాంగనమస్కృతు లాచరించి సంతోషముతో వెళ్ళెను. తమకుఁ బుత్రులు లేరని యపుత్రకులగు దంపతులు తెలుపగా వెంటనే వారి కాల్గురు పుత్రులుఁ గల్గునటు లాశీర్వదించెను. వారు కొబ్బరికాయలుఁ గొట్టి పూజించి వెళ్ళిరి. ఒకవిద్యార్థి పరీక్షలో నుత్తీర్ణుఁడు గాఁగోరెను. "పరీక్షయందు నెగ్గుటయెగాక ప్రథమ శ్రేణియం దుత్తీర్ణుఁడ వగుదు" వని యాశీర్వదించెను. అందువలన నా విద్యార్థి పరీక్షల బాధలనుండి తప్పించుకొనుటకై స్వర్గమునకుఁ పోవనెంచిన వాఁడు తిరుగ యింటికేగి పరీక్షలకు

హాజరగుటకు నిశ్చయించెను. గర్భశూలలచేఁ బాధపడు వాఁడరుగఁగా వెంటనే వాని బాధ బాపెను. ఇట్లే యాత్రికు లెల్లరు నీప్సితార్థములం బడసి యానందముతోఁ వెళ్లుచుండిరి. వారెల్లరును తన కెదురైన యాత్రికులకు సోమనాథునికంటెను గణేశునిఁ బూజించుటచేఁ గోరికలు వెనువెంటనే నెఱవేఱునని చెప్పసాగిరి. దేవతల భయముఁ దగ్గెను. స్వర్గమున విప్లవజ్వాలలు ప్రజ్వరిల్లి యరాచకమగు నేమో యని దిగులొందుచుండిన దేవేంద్రునకు హాయిగ నిదురఁబట్టెను. గణేశుఁడే సుప్రసిద్ధ లోకేశుఁ డాయెను.

## 42. దౌర్జన్య రాహిత్యము

ఒక సర్పమునకు హఠాత్తుగ మోక్షేచ్ఛ కలిగెను. తన పూర్వపు దౌష్ట్యములనెల్ల వదలి ముక్తిమార్గము నన్వేషింప దృఢసంకల్ప మొనర్చుకొనెను. అనంతర మేమి చేయవలయునో ఎఱుఁగక యొక మునీశ్వరుం జేరి తన నిశ్చయము నెఱుక బఱచి మోక్షసాధనోపాయము నెఱింగింపఁ బ్రార్థించెను. అమ్ముని దాని మనఃపరివర్తనమున కెదమెచ్చి "మనసార భగవంతుని ధ్యానింపుము. నీ కితరు లెట్టి బాధ గల్గించినను నోరిమితో సహించుము. వారి కెట్టి యపకారమును జేయక యరిషడ్వర్గములఁజయింపుము. సాధువృత్తినుండుము" అని బోధించెను. 'అహీంద్రుఁ డా మహామహుని మహోపదేశము బొంది యెట్టి జీవికి నీషణ్మాత్రమైన హాని యొనర్చక యహింసాసిద్ధాంతము నాచరింతు' నని దృఢసంకల్ప మొనర్చుకొనెను.

ఒకనాఁడొక దేవాలయము చెంత కరిగెను. దారి ప్రక్కనం గల పచ్చికలోఁ బరుండి యేకాగ్రతతో ధ్యాన మొనర్చుచుం డెను. ఆ యాలయమునకు వచ్చుచు బోవుచుండువారు కొందఱా పన్నగముం గాంచి భీతచేతస్కులై పరుగెత్తిపోసాగిరి. కాని యది వారిని వెన్నాడకుండుటయేగాక బుసయైనఁ గొట్టకుండుటఁ గాంచి ధైర్యముం దెచ్చుకొనిరి. ఆ వింతసర్పముం గాంచి పిల్లవాండ్రు కొందఱు దానిచుట్టును మూగిరి. "ఇది సర్పముగాదు. ఏదో సర్పమువంటి మడ్డిపురుగు. లేనిచో నిటునటు పారాడుటకు శక్తివిహీనమైన యొక ముసలిపామై యుండనోపు. రండు దీనిని రాళ్ళతో గొట్టి, యీడ్చుకొని యాడుకొంద"మని వా రందఱునుఁ గలసి పదునైన చిన్నచిన్న రాళ్ళ నా యురగేంద్రునిపై విసరి దానియొడలెల్ల గాయపఱచిరి. కాని యాపవనాశనము కదలక మెదలకుండెను. అదిగాంచి యబ్బాలు రంతటితో విరమింపక దండముతో నిచ్చవచ్చినటులఁగొట్టి మెడకొక త్రాడుఁగట్టి యాగ్రామవీధులలో లాగుకొని పోసాగిరి. ప్రతి యింటికడకునుఁబోయి "దీనిం జూడుడు! దీనిం జూడుడు!" అని యఱచుచు నింటిలోనివారి నెల్ల వీధిలోనికిం బిలచి చూపించుచుండిరి. కాని యా సర్పేంద్రము మాత్ర మా బాధలనెల్ల సహించి, తన సంకల్పమును స్మరించుకొనుచుఁ బూర్తిగ దౌర్జన్యరాహిత్యమూని యా పరమాత్మునే ధ్యానించుచుండెను. ఆ పిల్లవాండ్రకు నది విషోరగము గదాయని యించుకైనఁ దోపదయ్యె. ఆయూరియందు దాని నయ్యోయని దయఁదలచి యబ్బాలురను వారించువా

లోకరైనఁ గాన్పింపకుండిరి. ఎట్టకేలకు భానుఁ డస్తాద్రిఁ గ్రుంకెను. కనుచీఁకటి పడసాగెను. బాలు రెల్లరును దాని నా కోవెలకడ కీడ్చుకొనిపోయి "చీఁకటిపడుచున్నది. రేపు వచ్చి మరల యాడుకొంద"మని యనుకొని దాని నచ్చటనే వదలి తమతమ గృహములకేగిరి. పాప మా పన్నగ మందే స్పృహ దప్పి పడియుండెను. కొంతసేపైన పిదప దెప్పరిల్లి మెల్ల మెల్లగఁ దన గురువుకడ కరిగెను, దౌర్జన్య వర్తనమువలన తనకుంగల్గిన బాధల నెల్ల నా మహాత్మున కెఱిఁగించెను. అంత నమ్మౌని వరుండు "సిద్ధాంతము సర్వోత్కృష్టమైనది. కాని లోకము పాపమయము పూర్తిగ నీ వా ధర్మసూత్రము ననుష్ఠించుచో దుష్టులవలన బ్రతుకుండవు. బ్రతికియుండినఁగదా నిహపర సౌఖ్యసాధనకు వీలగును. కనుక ఆత్మరక్షణకై కొంచెము గంభీరత యవసరము. కనుక నీవు రేపుగూడ నా గుడికడకే యరుగుము. హరిని ధ్యానించుచుండుము. నీ కెవరైన హాని జేయుటకు సమీపించుచో బుసఁగొట్టుము. ప్రాణాపాయము లేక తపమును నిరాటంకముగ సాగించుకొనుము" అని యుపదేశించెను.

మరునాఁ డా సర్పరాజ మా యాలయము చెంత కరిగి ధ్యానముఁ జేయుచుండ నా బాలురు మరల నరుదెంచిరి. పన్నగ మది కనిపెట్టి యొకపరి బుస్సుమనియెను. అది తమ్ముఁ [illegible]ల్లరును భయపడి పరుఁగిడిపోయిరి. దాని[illegible]ండి యెట్టి యవరోధమును లేకఁ జక్కగ